# చెన్నపురి ఆయుర్వేదకలాశాల.

---

ఆయుర్వేదమును లక్ష్యలక్షణములతోడను పాశ్చాత్య ద్యమందలి అనాటమీ ఫిజియాలజీ మొదలగు వానితోడను ర్పబడును.

ఇందు "ఆయుర్వేదభూషణ" అను సంస్కృతశాఖయు షగ్వర" అను ఆన్ధ్రశాఖయును రెండుశాఖలు గలవు.

సంస్కృతశాఖకు నాటకాంత సంస్కృతజ్ఞానము గల రుగ నుండవలెను.

ఆన్ధ్రశాఖకు తెనుగున మంచి భాషాజ్ఞానము గలిగి యుండవలెను.

విద్యార్థులు 16 వత్సరములకు తగ్గకను 24 వత్సరము లు మించనివారుగ నుండవలయును.

కలాశాలయందు జేరగోరువారు అక్టోబరు మాసాంత నకు దరఖాస్తులను బంపుకొనవలెను.

వివరములు గోరువారు కలాశాలాధ్యక్షులకు వ్రాసిన లుసుకొనవచ్చును.

ర్వేదకలాశాల,
మదరాస్.

వైద్యరత్న పండిత. డి. గోపాలాచార్లు,
ఏ. వి. యస్., ఏ. యం. బి.
ప్రిన్సిపాల్.

ఋగ్వేదాశ్రమ గ్రంథమాల—౧౨.



గడచిన నూరుసంవత్సరములయందు జరిగిన

# వైద్యాభివృద్ధి

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులు,

ఎ. వి. ఎస్., ఎ. ఎమ్. వి.

Ayurvedasrama Series—12.

# The Progress of Medicine during the last hundred years.

## AN ADDRESS

Delivered at the Hindu University Foundation Ceremony at Benares.

BY

**Lieut.-Col. K. R. KIRTIKAR,**

F. L. S., I. M. S. (RETD.)

*with Telugu Translation*

BY

**Vaidyaratna Pandit D. Gopalacharlu,**

A. V. S., A. M. B.,

*Principal, Madras Ayurvedic College and Senior Physicians, Madras Ayurvedic Free Dispensary, Madras; Ex-President, Ayurvedic Congress, Malabar, All India Ayurvedic Conference, Bombay; President, All-India Board of Ayurvedic Education, Allahabad, U. P.; Examiner & Member, Text Book Committee, Ayurvedic and Unani Tibi College, Delhi, Examiner, Mysore Govt. Ayurvedic Vidwat Examinations, and, of D. A. V. College, Lahore.*

---

**AYURVEDASRAMA, MADRAS.**

**1916.**

---

ఆయుర్వేదాశ్రమ గ్రంథమాల—౧౩.

గడచిన నూరుసంవత్సరములయందు జరిగిన

# వైద్యాభివృద్ధి.

ఇది

వారాణసీపురమున జరిగిన హిందూ విశ్వవిద్యాలయ

శంకుస్థాపన మహోత్సవసమయమున

లెఫ్టినెంట్ కర్నల్ కే. ఆర్. కీర్తికర్,

ఎఫ్. ఎల్. ఎస్., ఐ. ఎమ్. ఎస్. (రిటైర్డు.) గారిచే

నాంగ్లభాషయందు విరచితము.

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులు,

ఏ. బి. యస్., ఏ. యమ్. బి., గారిచే

నాంధ్రీకృతము.

చెన్నపురి.

౧౯౧౬ సం॥

చెన్నపురి :

55, ఆచారప్పన్ వీధియందుగల

వైద్యరత్న, పండిత డి. గోపాలాచార్యులవారి

స్వకీయాయుర్వేద ముద్రాయంత్రమున ముద్రింపబడి

ఆయుర్వేదాశ్రమమున ప్రకటింపబడియె.



# పీఠిక.

శ్రీవారాణసీక్షేత్రము ఆర్యవిద్యలకు ప్రధానవిద్యాపీఠమనుట లోకవిదితము. ఈవిశ్వనాథక్షేత్రమున గడచిన ఫిబ్రవరి (4) నాలవదినము భారతదేశమందలి పండుగదినములలో నొకటిగ నెన్నబడెను. ఈపుణ్యదినముననే హిందూవిశ్వవిద్యాలయ శంకుస్థాపనమహోత్సవము భారతసామ్రాజ్యప్రతినిధియగు శ్రీ లార్డు హార్డింజి మహామహునిచే జరుపబడెను. అత్తరి ప్రాచ్యప్రతీచ్య వైద్యవిద్యలయం దారితేరిన భిషక్చూడామణులచే రెండు మహోపన్యాసములు గావింపబడెను. అందు మొదటిదియగు "ఆయుర్వేదప్రశస్తి" నా ప్రియమిత్రులగు మహామహోపాధ్యాయ కవిరాజ గణనాథసేన్ ఎమ్. ఏ. ఎల్. ఎమ్. అండ్. ఎస్. గారిచే నుపన్యసింపబడినది. దీనిని పాఠకమహాశయుల యుపయోగమునకై మా గ్రంథమాలయందు ౧౧-వ గుచ్ఛముగ ముద్రించితిని. రెండవదియగు నీమహోపన్యాసము ప్రాచ్యప్రతీచ్యవైద్యవిద్యాధురంధరుడును, భారతవైద్యశిరోమణియును, అనేక సచిత్రౌషధితత్త్వగ్రంథరచనాధురీణులును, జ్ఞానవయోవృద్ధులునగు లెఫ్టినెంటు కర్నల్ కే. ఆర్. కీర్తికర్ F. L. S., I. M. S., (రిటైర్డు) మహాశయునిచే నాంగ్లభాషయం దొసంగబడినది. ఇందు గడచిన నూరువత్సరములయందలి వైద్యాభివృద్ధిని గూర్చి విపులముగ చర్చింపబడియున్నది. ఈయభివృద్ధి పాశ్చాత్యవైద్యమునకు జేరియున్నను అందలి ముఖ్యవిషయములు ఆయుర్వేదమునందే గలవని స్థిరపరచియున్నారు. కర్నల్ జాన్సన్ గారు ఆయుర్వేదమునుగురించి చూపిన నిరాసమునకు సదుత్తరము నొసంగియున్నారు. దీని సామర్థ్యముచేత నీయిందలి విషయములు సుబోధములు గాన విస్తరింపనైతిని. పరివర్తన మొనరించునపు డిందలి వైద్యసాంకేతికపదములకు ప్రతిపదములను సాధ్యమైనంతవరకు నాంధ్రభాషయందు గనపరచితిని. అందు కొన్నిటికి దగుపదములు దేశ

భాషయందు దొరకమిచే నాయాంగ్ల పదములను ఆభాషయందే చూపుచు వాని యభిప్రాయము నాంధ్రభాషయందు గనపఱచినాడ. వ్యవహారదశయందు గల వైద్యమును దానిచరిత్రమును అభివృద్ధిని ఇత్యాది చక్కగ దెలుపును. ఉభయజ్ఞానవేత్తలచే వ్రాయబడిన యిట్టి పుస్తకములు పాఠకమహాశయులకు మిక్కిలి యుపకారమును గలిగించును. ఇట్టి గ్రంథములను మఱికొన్నిటిని పాఠకులకు త్వరలో నందజేయగలనని విన్నవించెదను.

ఇందు పరివర్తనము ముద్రణము మొదలగువానిచే గల్గులోపములు మెండుగ నుండవచ్చును. అయ్యవి పాఠకమహాశయులు దిలకించి తెలుప ప్రార్థితులు. వానిని పునర్ముద్రణమున సవరించి ముద్రించుచున్నాడను.

చెన్నపురి,
ఆయుర్వేదాశ్రమం.

ఇట్లు,
పండిత డి. గోపాలాచార్యులు.



లెఫ్ట్నెంట్ కర్నల్ కే ఆర్. కీర్తికర్,

ఎఫ్. ఎల్. ఎస్., ఐ. ఎమ్. ఎస్. (రిటైర్డు).

శ్రీ

"గడచిన నూరుసంవత్సరములయందు జరిగిన

# వైద్యాభివృద్ధి"

మహాశయులారా !

హిందూదేశ విద్యావిషయక చరిత్రాంశమున 1916-వ సం॥ 4-వ ఫిబ్రవరి యొక పండుగదినముగ నున్నది. వారాణాసీ పురమునకు ప్రత్యేకముగ నొక హిందూ విశ్వవిద్యాలయమీయబడెను. గంగా యమునానదుల సంగమమునకు సమీపముననే యీ నూతన విశ్వవిద్యాలయము స్థాపింపబడును. ప్రాక్పశ్చిమ దేశీయుల యాలోచనలు (Thoughts) ను, పరిజ్ఞానము (Culture)ను, అందిమిడియుండును. అట్టిదేశీయుల కృషియు, నాగరికతయు నభివృద్ధినొందుటకై హిందూదేశీయులెల్లరు నీ కాశీక్షేత్రమునందు సమకూడవలెను. ఈ వ్యాసమాలలకార్యమును నిర్వహించుటకై నేను కోరబడుటవలన నాకు గొప్పమర్యాద కలిగియున్నటుల తలచుచున్నాను. ఈ వ్యాసములు, వాగ్ధోరణి (Eloquence), ఎక్కువపరిజ్ఞానము (Deep culture), మేధాశక్తియనువానితో నిండియుండుటయేగాక మనయందు నూతనపరిశోధనోత్సాహమింకను నిలిచియున్న

దనియు, అట్టి పరిశోధనకు తగు సామర్థ్యమును మనము కలిగి యున్నామనియు సూచించుచున్నవి. నాకునియమించిన వ్యాసమును పూర్ణముగ సఫలము నొందించుటకై నాకుగల సామర్థ్యమును శక్తిని గూర్చి సంకోచపడుచున్నాను. అయినను నా యిష్టానుసారముగ చెప్పనిత్తురనియు, నాయందలి మీ యవ్యాజ కరుణయే నాలోపములను మన్నించుననియు నేను నమ్ముచున్నాను.

లెక్క ప్రకారముచూడ నూరువత్సరములనగ, ఏ భయంకరమైన నెపోలియన్ యుద్ధములు ఐరోపాలోని పలుతెగలవారిని బాధించి మేటివారిని, సమర్థులను, అసహాయులను బరిమార్చెనో, మరియెపుడు నెపోలియన్ అనునాతడు వాటర్లూ రణరంగమున డ్యూక్ ఆఫ్ వెల్లింగ్టన్ వలనను, బ్లూచెర్ వలనను, ఓడింపబడెనో అట్టి 1815-వ సంవత్సరముయొక్క కాలముగ తేలుచున్నది.

నే చెప్పబోవు విషయమునకై విలియమ్ హార్వే అనునతడు రక్తచలనము (Circulation of blood) ను తొలుదొల్త కనుపరచినకాలమును గురించి విచారించవలసియున్నది.

హిందూదేశమందలి యాంగ్లేయ ప్రభుత్వముయొక్క యభివృద్ధి, ప్రముఖులైన కొందరి వైద్యోపాసకుల నామధేయములతో నెక్కువగసంబంధించియున్నది. బౌటన్, హామిల్టన్ లయొక్క సాటిలేని స్వదేశాభిమానమువలననే ఈస్టిండియా

కంపెనివారును, వేరువిధమున బ్రిటీషువారును హిందూదేశమున స్థావరముల నేర్పరచుకొన గలిగిరి. సుప్రసిద్ధులయిన యీయిరువురిడాక్టర్ల వైద్యనిపుణతయు, ఈదేశమందలి ఈస్టిండియాకంపెనీవారి వర్తకజయమున కెట్లుతోడ్పడెనో విచారించుట చరిత్ర విషయమగు సంశమై యున్నది. ఎక్కువగ శస్త్రచికిత్సకుని ముఖ్యమగు పనిముట్టు (Lancet of the Surgeon) వలనను, చికిత్సకుని నైపుణ్యమువలనను, తక్కువగ యుద్ధవీరుని ఖడ్గమువలనను, స్వప్రయోజనకారియొక్క కపటోపాయము వలనను, ఈ పూర్వదిశయందలి బ్రిటీషువారి యధికారము స్థిర పరుపబడెను. వైద్యసహాయము, వైద్యపాఠశాలలయొక్కయు చికిత్సాలయములయొక్కయు స్థాపనలు, హిందూదేశమందలి పలుతెగల వారియందు స్నేహభావమును సమాధానమును పురికొల్పుటయందును వారిపైన యాంగ్లేయుల యధికారమును హెచ్చించుటయందును ఇతరములగు పన్నుగడలకంటెను ఎక్కువగ అనుకూలపడెను. వైద్యవృత్తివలన లోకమున కత్యుపకారము కలుగుచున్నదను విషయ మెల్లయెడల యొప్పుకొనబడుటయే హిందూజనుల హృదయములు బ్రిటిషుప్రభుత్వమెడల యాదరణచూపునటులచేయుచున్నది. ఏలనన, హిందువులు బ్రిటిషు ప్రభుత్వమువారి యెడల కృతజ్ఞతగలవారుగ నుండునటుల బాధనొందు హిందువుల యెడ వైద్యశిక్షాముఖములొనర్చు నసేకోపకారములను గురించి బ్రిటిషువారు మెచ్చుకొనగలరు.

ఔషధశాలలును, ఆసుపత్రులును మనదేశమువారి కెంత మేలును చేయుచున్నవో యంతకన్న తక్కువ మేలు వైద్య పాఠశాలలును కళాశాలలును చేయుటలేదు. మొదటివి శరీరమునకు సంభవించు బాధలను తొలగింప ప్రయత్నించుచున్నవి; రెండవవి వైద్యశాస్త్రమును నేర్పుటచే జనుల హృదయమునకెక్కువ తెలివితేటలను కలిగించుటయేగాక హిందూ జనుల మూఢవిశ్వాసములను దురభిమానములను నశింపజేయుటలో ప్రసిద్ధినిగాంచుచున్నవి. హిందువుల మూఢవిశ్వాసముల యడ్డంకులు తగ్గినయెడల అట్టిమార్పుయొక్క ఫలితము వైద్య శాస్త్రముయొక్క ప్రచారమువలననే యెక్కువగ కలిగియుండి యుండును. వైద్యశాస్త్రజ్ఞానము నెమ్మదిగను రహస్యముగను ఒకేవిధమునను ఈ దేశమందు పూర్తిగ మార్పును కలిగించెను; మరియు నది మూఢవిశ్వాసములను తప్పు అభిప్రాయములను తొలగించి మనుజులకు జ్ఞానాభివృద్ధిని కలిగించుచున్నది.

బాధచే పీడింపబడు జనులవిషయమునను ఈ దేశమందలి సంస్కారమువిషయమునను పైన నుడివినటుల సహాయమొనర్చుటలో గెల్పొందిన వైద్యవృత్తికి సర్వవిధముల ఘనత కలుగవలెను. తమ కార్యములను నిర్వహించుటయందు కష్టించి పలుబాధలకు లోనైన మహామహులకుగూడ మర్యాద కలుగవలెను. వైద్యులుచేయు కార్యములు చిత్రవిచిత్రములుగను బహురూపములుగను ఈ హిందూదేశమునందున్నట్టు మరి

యెచ్చుటను గానరావు. వారు ఎక్కువ చురుకుతనముగను ఉపయోగకరముగను పలువిధముల కార్యములొనర్చు వైద్యులుగ నుండిరి. ఎవరుచేసిన పనులు శాశ్వతముగ నిలచియున్నవో మరి నిలచియుండునో అట్టి సత్ప్రవర్తనగల సమరిటనులు (Samaritans) వారు గతించియుండినను జ్ఞాపకమునందున్నారు ; మరి జ్ఞాపకమునందుందురు.

ప్రసిద్ధులైన వైద్యులను సాధారణముగ నీ క్రిందివిధమున విభజించవచ్చును.

1. ఎవరైనను ఏవిషయములనైన మొట్టమొదట నూతనకల్పనలవలన కనిపెట్టినపుడు అట్టివిషయములవలన వైద్యశాస్త్రమునందుగాని వైద్యవిద్యయందుగాని సమూలమైన మార్పు కలుగునెడల నట్టివారు వైద్యులజాబితాయందు ప్రథమగణ్యులుగ నెంచబడుచున్నారు. వారిలో నిశ్చయముగ "హార్వే"అనునతడు ప్రప్రథముడుగనున్నాడు. రక్తముప్రవహించుచున్నదని యీతడు మొదటితూరి కనిపెట్టిన సంగతి యిప్పటి వైద్యశాస్త్రమునకు మూలాధారముగ నున్నది. ఈతరగతిలోనిఇతర పేరులలో "జెన్నరు"ను ఉదాహరించవచ్చును.టీకాలు (Vaccination) వేయుట నాతడు మొట్టమొదట కనిపెట్టి వనాటనుండియు రోగములను సోకకుండచేయుటకై యేర్పడిన యౌషధము(Preventive medicine) లు ప్రారంభమయ్యెను. "లెయినెక్" అనువాడు నూతనముగ కనిపెట్టిన స్టెథస్కోప్

(Stethoscope) అను సాధనము రొమ్మునయొక్క యనేకరోగములు నిదానములకును, "బ్రైట్" అనువాడు నూతనముగ కని పెట్టిన ఆఫ్థాల్మస్కోప్ (Opthalmoscope) అను సాధనము కండ్లయొక్క యనేకరోగముల నిదానములకును సాధనములయ్యెను. బాక్టీరియాలజి (Bacteriology - కంటికి కాన రాని పురుగులకు సంబంధించిన శాస్త్రము) యందు పరిశోధన లొనరించిన "పాశ్చర్" అనువాడును "లిస్టర్" అనువాడును, వ్రణములను శుభ్రపరచుటయందు ఇంతింతనరాని మహోపకారమొనర్చిరి. క్లోరోఫారమ్ (Chloroform) అను వస్తువును నూతనముగ కనిపెట్టిన "సిమ్సన్" అను నతడు కర్తకోతల నెంతమాత్రము బాధలేనివిగ జేసెను.

2. నూతనశస్త్రచికిత్సలను చేయుటకు ప్రారంభించిన వారును, మనుజులకు సంభవించు ననేక గూఢవ్యాధులను స్పష్టము చేయగలిగిన రోగపరీక్షకులును, ఈరెండవతరగతిలో నెన్నబడుదురు. మరియు నీతరగతిలో, శస్త్రచికిత్సకులయందు సర్ ఆస్ట్లెకూపర్, సర్ బెంజమన్ బ్రోడై, లిస్టర్, ఫెర్గ్యూసన్, బిజెలో, ఎస్మార్చ్ అను వారిపేరులను, వైద్యులయందు గ్రేవ్స్, బ్రైట్, అడ్డిసన్, ఛార్కోట్, విల్కన్ అనువారి పేరులను జెప్పవచ్చును.

3. వైద్యశాస్త్రకోవిదులు (Medical Scientists) ప్రత్యేకతరగతిగ నున్నారు. వారు ముఖ్యముగ శారీరశాస్త్ర

జ్ఞులు (Anatomists) గను, జంతుదేహధర్మశాస్త్రజ్ఞులు (Physiologists) గను, రోగలక్షణశాస్త్రజ్ఞులు (Pathologists) గను నున్నారు. వారుచేసినశోధనలు (Experiments) ను కనిపెట్టిన విషయములును వైద్యవృత్తికి నెంతో ప్రయోజనకారులుగనున్నవి. హంటర్, గూడ్సర్, మన్రో, టర్నర్, మైఖేల్ ఫాస్టర్ మున్నగు ననేకుల నామములను ఈతరగతియందు చేర్పవచ్చును.

4. తాము చేయుపనులకు సంబంధించిన సరియైన మంచిజ్ఞానమునుపొంది తమవృత్తులయందు తాము చేయుకార్యములను ఎక్కువగ మెచ్చుకొనునట్లొనర్చిన వైద్యులపేరులను ఈనాల్గవ తరగతియందు చెప్పనొప్పును. వీరు ముఖ్యముగ యిరోపా, అమెరికా ఖండములలోని వైద్యపాఠశాలలయందును, ఆసుపత్రులయందును ఉద్యోగులుగ నున్న శస్త్రచికిత్సకులు (Surgeons) ను, వైద్యులు (Physicians) ను, అయియున్నారు. ఔషధముల (Medicine) ను గురించియు, శస్త్రచికిత్స (Surgery) ను గురించియు గ్రంథములను వ్రాసినప్రముఖులు ఈతరగతికి చేరియున్నారు.

మనదేశములో నిప్పటికాలమునందు వైద్యవృత్తియందున్నవారిలో పైమొదటితరగతిలోని హార్వే, జెన్నర్ మున్నగువారితో సమముగ నెంచబడువారింకను లేకున్నారు. అయిన, పై రెండు, మూడు, నాల్గవతరగతులలో మెప్పొందగలస్థాన

ముల నాక్రమించగలవారు మన హిందూదేశమున ననేకు లున్నారు.

హిందూదేశమందలి వైద్యులు, తమవృత్తికి సంబంధించిన శాస్త్రమును, విద్యను అభివృద్ధినొందించుసటుల నెక్కువగ దోడ్పడిరి. అట్టివారు మనదేశమందు బాధనొందువారి బాధలను తొలగించుటయేగాక వారొనర్చిన శోధనలను (Researches) గురించియుచేసినవిమర్శనములను(Investigations)గురించియు నుప్రశస్తిగాంచిరి. వారు,ఉష్ణదేశమునకు సంబంధించినరోగముల (Tropical diseases) యొక్క కారణముల (Aetiology)ను, రోగలక్షణముల (Pathology) ను, రోగచిహ్నముల (Symptomatology) ను జాగ్రతగ జదివి ఆట్టిరోగములనుగూర్చి ఎక్కుడుసంగతులను తెలియజేసిరి. హిందూదేశమందలి వైద్యులుపడిన కష్టమునకుగాను వారికి వందనము లొనర్పనలెను. ఏలనన, ఇపుడు ప్రపంచములోనివారందరును, మన్యజ్వరములు (Malarial fevers), వాంతిభేది, బెరిబెరి (నంజు), మున్నగు నితర వ్యాధులనుగురించి ఎక్కువ మంచిజ్ఞానమును కలిగియున్నారు. ఉష్ణదేశమందుపయోగింపబడు ఔషధము(Tropical medicine) ల విషయమై ఎందరు కష్టించి పనిచేసియున్నారు? అనెస్లే, మోర్‌హెడ్, వైనింగ్, ఫెరెర్, మెక్‌లియార్డ్, కార్టర్, ఛేవెర్స్, మార్టిన్, రాస్, రాజర్స్ అనువారలే. వారుచేసిన శోధనలను ఔషధములను గురించి క్రమముగ

వ్రాసిన గ్రంథకర్తలు సరియైన విధమున మెచ్చుకొనియున్నారు.

మరియు, హిందూదేశమందలి వైద్యులు సర్పవిషమునుగూర్చిన జ్ఞానమును అభివృద్ధిచేసియున్నారు. వారు హిందూదేశమందుంగూడి సర్పముల స్వాభావికచరిత్రమును పరిశీలించి, సర్పవిషమును పరీక్షించి, పాముకాటులను (విషమును) నశింపజేసి, స్వస్థతనుగాంచుటకు పలువిధోపాయములను నుడివియుండిరి.

హిందూదేశమందు మితవ్యయముగ నెంచబడు పదార్థముల(Economic products) ను గూర్చియు ముఖ్యముగ స్వదేశీయౌషధుల (Indigenous drugs) ను గూర్చియు వారుపడిన కష్టములు ఎక్కువగ నుపయోగకరములయ్యెను. అట్టిమితవ్యయ పదార్థములనుగూర్చి వ్రాసిన గ్రంథకర్తలలో దాదాపుగనందరు వైద్యులే. ఔషధములను చేయునట్టియు నేర్పునట్టియు శాస్త్రము (Pharmacology) ను గూర్చియు వైద్యశాస్త్రము (Therapeutics) ను గూర్చియు వారు చేసినపని విషయమై షాగ్‌నెస్సి, ఎయిన్‌స్లె, వేరింగ్, షైమింగు, బక్‌డ్‌ఫ్రాడ్, కన్నిలాల్‌దేవ్, మొహిదీన్ షెరీఫ్, ఉదయచంద్రదత్, డైమోక్, వాట్, మున్నగు వారు హిందూదేశమందు జనించిన యౌషధులను గురించి వ్రాసిన పుస్తకసంఖ్యవలననే సులభముగ తెలిసికొనవచ్చును.

ఉష్ణదేశరోగము (Tropical disease) లు, సర్పవిషము (Snake poison), మితవ్యయమును చేయించు పదార్థములు (Economic products), హిందూదేశమందు ముఖ్యముగనుండు మూలికలు-వీనియొక్క జ్ఞానము హిందూవైద్యుల పరిశోధనల వలన నెక్కువగుటయేగాక వారి శస్త్రచికిత్సాజ్ఞానమునకును, ఓషధిజ్ఞానమునకును ఎక్కువగ తోడ్పడినది ఐరోపాలోగాని అమెరికాలోగాని ఒక శస్త్రచికిత్సకుడు ఒక సంవత్సరములో చేయుటకు వీలున్న శస్త్రచికిత్స (ఆపరేషను) లను హిందూదేశమందు ఒక శస్త్రచికిత్సకుడు ఒకమాసమున చేయుచున్నాడు. హిందూదేశము మిలిటరీవారికిని సివిల్ సర్వీస్ వారికిని మాత్రమేగాక వైద్యులకునుగూడ విద్య నభ్యసించుటకు ననుకూలమైన దేశముగానున్నది. సర్ జోసెఫ్ ఫేరెర్ కును, యన్. సి. మెకాన్మరకును, ఇటీవల సర్ రోనాల్డ్ రాస్ కును, సర్ హెవిలాక్ ఛార్లెస్ కును కలిగిన జయము వారు హిందూదేశమునచేసిన యుద్యోగమునకు నెక్కువగ సంబంధించియేయున్నది. మొన్నటివరకు నుత్తమోత్తమమైనదిగ నెంచబడుచుండు స్వాస్థ్యవృత్తము (Hygiene) అను గ్రంథమును రచించిన లేటు డాక్టర్ ఇ. ఎ. పారక్స్ అనునతడు హిందూదేశముననే ఆరోగ్యరక్షణ (Sanitation) మున విద్యనభ్యసించిజ్ఞానవంతుడై యుండెను. మరియు సర్. డబ్ల్యు. డబ్ల్యు. హంటర్ గారిచే విరచితమగు "మోరల్ అండ్ మెటీరియల్ ప్రోగ్రెస్ ఆఫ్ అవర్

ఇండియన్ ఎంపైర్ " అను పుస్తకమునందును, "మెడికల్ ప్రో
గ్రెస్ ఇన్ ఇండియా " అను పేర డాక్టర్ మూర్ హెడ్ చే
వ్రాయబడిన గ్రంథము నక్రింది చారిత్రము వైద్యవృత్తి
వలన సాధింపబడిన పనినిగూర్చి సూక్ష్మబుద్ధిచే వ్రాయబడి
యుండుటచే నిచట నుదాహరింపబడుటకు ఎట్టి క్షమాపణము
నక్కర లేకున్నది.

—॥ హిందూదేశమందు వైద్యాభివృద్ధి. ॥—

"బ్రిటిషువారు హిందూదేశముతో సంబంధమును
కలిగియున్న యాదికాలమునందు దేహసౌఖ్యము ననుసరించి
యుండు శీతోష్ణస్థితిగతు లవశ్యముగా గమనింపబడియుండె
ననుట కీ క్రిందివిషయము లుదాహరణములుగ నున్నవి. (1)
18 వ శతాబ్దము చివరభాగమునుండి యిప్పటివరకు వైద్యము
నందు క్రొత్తసంగతులను కనిపెట్టిన యనేకులచే వ్రాయబడిన
ప్రత్యేకపు గ్రంథములు; (2) 1817 వ సంవత్సరమున సంభ
వించిన భయంకరమైన వాంతిభేదిరోగమును గురించి బెంగాల్,
మద్రాసు, బొంబాయి మెడికల్ బోర్డ్ల రిపోర్టులు, మద్రాసు
ప్రెసిడెన్సి మెడికల్ బోర్డువారు 1825 మొదలు 1840 వ సం॥
వరకు వైద్యమునకు సంబంధించినంతవరకు ఇచ్చిన ప్రెసిడెన్సి
ముఖ్యపట్టణములయొక్క స్థలవర్ణనములు; (3) కలకత్తా మెడి
కల్ అండ్ ఫిజికల్ సొసైటీవారు 1823 మొదలు 1839 వ
సం॥ వరకును, బొంబయి సొసైటివారు 1837 మొదలు 1876

వ సం॥ వరకును చేసినపనులు, 1855 వ సం॥ పిదప వైద్య శాస్త్రముయొక్క హిందూదేశ (కలకత్తా) చరిత్రములు, వేర్వేరుకాలములయందు ఆయా ప్రసిడెన్సీలయందు వెలువడిన ఇతరపత్రికలు; (4) 1820-1830 సంవత్సరముల మధ్యకాలమున కలకత్తా బొంబయిలలో మున్ముందుదేశభాషలలో ప్రారంభమైన వైద్యపాఠశాలలు, 1835 - 1850 మధ్యకాలమున బెంగాలు మద్రాసు బొంబయిలలో నారంభమైన వైద్యకలాశాలలు, తరువాత సంవత్సరములలో హైద్రాబాదు (డక్కను), నాగపూరు, ఆగ్ర, లాహోర్, బలరామపూరు (అయోధ్య), పాట్నా, డక్కా, పునహా, అహమదాబాదులలో ప్రబలిన వైద్యపాఠశాలలు, హిందువులు నేర్చిన వైద్యసంబంధమైనవిద్య; (5) 1827 వ సం॥ నుండి హిందూదేశమునకు సంబంధమైన వైద్యపాండిత్యమునందు ప్రముఖతను పొందినట్టియు 1863 వ సం॥ మున శానిటరీ కమీషనర్లు నియమింపబడినది మొదలు ఎక్కువ ప్రసిద్ధిగాంచిన జనాభాలెక్కలును నయ్యున్నయవి."

పవిత్రమైన నామముగ జ్ఞాపకముంచుకొనతగిన హిజ్. మెజస్టీ శ్రీమద్విక్టోరియా మహారాజ్ఞియొక్కయు ఆమె తరువాత సంతతివారియొక్కయు కొలువునందున్న మెడికల్ ఉద్యోగస్థులు కల్లోలములులేక నెమ్మదిగ నుండుకాలమునందే గాక యుద్ధసమయమునను యుద్ధరంగమునను తమ సాహసమైన నడవడికవలన ప్రసిద్ధినిగాంచియుండిరి.

ఔషధమును శస్త్రచికిత్సను పశ్చిమదేశపద్ధతుల ప్రకారము విద్యగరపు పాఠశాలలలో విద్య నేర్చిన హిందూదేశీయులు ఇప్పటికాలమున నేమిచేయుచున్నారను విషయము తరుచుగ ప్రశ్నింపబడునదిగను, ఇప్పటికిని పూర్ణముగ జవాబును పొందనట్టు కనుపడునదిగను నున్నది. ఈ ప్రశ్నమునకు పూర్ణముగ జవాబునిచ్చుటకై వైద్యకలాశాలలయొక్కయు పాఠశాలలయొక్కయు ఈదేశమందలి వైద్యవిద్యా పద్ధతియొక్కయు ప్రకృతపుస్థితిని మనము పునర్విమర్శనము చేయవలెను. అయిన నిదిచేయుటకు పూర్వము స్వదేశహిందువులలో ననేకులు వైద్యవిద్యకంటె నెక్కువగ ధర్మశాస్త్రము (Law) నందును, శిల్పవిద్యయందును, (ఇంజినీరింగునందును) శాస్త్రభాగము (Arts) నందును ప్రసిద్ధతను గాంచియున్నారని చెప్పుట యావశ్యకమైయున్నది. ఇట్లగుటకు స్వదేశహిందువులలో నెక్కువ తెలివిగలవైద్యుల కున్నతస్థానముల నలంకరించు మార్గములేకపోవుటయే తగినకారణముగ కనపడుచున్నది.

1835-వ సం॥ రమున కలకత్తా వైద్యకలాశాల (మెడికల్ కాలేజీ) స్థాపింపబడెను. కొంచెముకాలము క్రిందటివరకు కలకత్తా యూనివర్సిటీలో వైద్యక పట్టపరీక్షయందు కడతేరిన వారిలో నొక్కరైన నీకాలేజీలో ప్రొఫెసరుగా నియమింపబడకుండుట యాశ్చర్యముగనున్నది. హిందూదేశమందు వైద్యమున పట్టపరీక్షయందు తేరినవారు ఏజిల్లాలయందును సివిల్

సర్జనులుగా నియమింప నర్హులు కారని తలచబడుచున్నారు. ఎట్టియుద్దేశములతో కలకత్తాలోని వైద్యశాలాశాల స్థాపించబడెనో, అట్టియుద్దేశములతోడనే బొంబాయి గ్రాంటు మెడికల్ కాలేజీగూడ స్థాపింపబడెను. బొంబాయి యూనివర్సిటీలో మెడికల్ పట్టపరీక్షయందు తీర్ణులైనవారిలో నొకర్తైనను, ఈ కాలేజీలో ప్రొఫెసరుగగాని, ముఖ్యమైనచోటుల సివిల్‌సర్జనుగగాని మొన్నటివరకు నియమింపబడి యుండలేదు.

ఇండియన్ యూనివర్సిటీలయందు దారిచేరిన పట్టభద్రులగువారికి ప్రోత్సాహమును గలిగించెడి గొప్పపదవిగాని వారిని చూచి ఇతరులు అసూయపడతగినంత యున్నతస్థితిగాని కలిగియుండలేదు. వారు సామాన్యమైన మెడికల్‌ఉద్యోగమునందు సివిల్‌డిపార్టుమెంటులో నెలకు 100 మొదలు 300 రూపాయీలవరకు జీతముగల అసిస్టెంటు సర్జనులుగ ప్రవేశించుచున్నారు. లేదా ముఖ్యపట్టణములయందుగాని, ప్రసిద్ధిలేని కుగ్రామములయందుగాని సాధారణవైద్యులుగనున్నారు. ఏదేశమందైనను సాధారణముగ వైద్యముచేయువారు వైద్యమునందు నాయకులుగ (Leaders) గాని వీరులుగ (Heroes) గాని ప్రసిద్ధినిగాంచియుండలేదు. గాన హిందూదేశమున నట్టిస్థితిని బడయగోరుట వ్యర్థమగును. అయినను హిందూవైద్యపట్టభద్రులు తాము కీర్తిని సంపాదించులాగునను, బాధాపీడితుల కుపకారము చేయులాగునను, తమవృత్తిని ఆచరించి

యున్నారు. వారికి సంబాధించినవారు వారి వైద్యనిపుణతను మెచ్చుకొనియున్నారు. "దేసియందు హిందువులు ప్రసిద్ధమైన అర్హతను కలిగియున్నారో అట్టి శస్త్రచికిత్స యొక శాస్త్రము గనున్నది; స్వదేశ శస్త్రచికిత్సకులయందనేకు లత్యుత్తమమైన నిపుణత గల్గియున్నారు. లండను, లేక పారిస్ శస్త్రచికిత్సకులకు నింద కలుగకుండునట్లాగున వారు కఠినమైన శస్త్రచికిత్సలను తరుచుగ చేయుచున్నారు. హిందూదేశమందలి యాంగ్లేయవైద్యవిద్యయొక్క మంచిఫలితములు స్వదేశచికిత్సకులయందు కనపడుచున్న" వని సర్ జాన్ స్ట్రాకె అనువారు తాము రచించిన "ఇండియా" అను పుస్తకమునందు వ్రాసియున్నారు. హిందూదేశముయొక్కయు హిందూదేశీయులయొక్కయు జ్ఞానము ఎవరియందద్వితీయముగ నున్నదో అట్టి వారే ఈయభిప్రాయము నిచ్చుటచే నిది హిందూదేశవైద్యులనెక్కువగ గౌరవించుచు పొగడుచున్నది.

కలకత్తా మెడికల్ కాలేజియందు శస్త్రచికిత్సాభాగమున నిదివరలో ప్రొఫెసరుగనున్న సర్జన్ కర్నల్, రె, అనువారు హిందూవైద్యులు తమవృత్తియందు కలిగియున్న సామర్థ్యమునుగురించి యెక్కువ గొప్పగ చెప్పియున్నారు.

"హిందూవైద్యుల చికిత్సానిపుణత అన్ని విషయముల నొప్పుకొనబడియుండుటచేత వారిస్థితిచక్కబరచుటయు వారిపదవిని అభివృద్ధిచేయుటయు కోరతగియున్నవి. హిందూవైద్యులు

కఠినమైన శస్త్రచికిత్సలను ఎక్కువ బాగుగ నెరవేర్చియుండుట చేత ధైర్యముగ శస్త్రచికిత్సను చేయువారనియు, వైద్యనిపుణులనియు, రసవాదశాస్త్రరీతిననుసరించి పదార్థములను విభజించువారనియు (Subtle chemical analysers) మంత్రసానితనమునందు నేర్పరులనియు, వారు రుజువుపరచియున్నారు. గొప్ప పనులయందుగాని జవాబుదారీగల ఉద్యోగములయందుగాని వారిని నియమించుట కెట్టియభ్యంతరమవుచున్నది? ప్రస్తుతము వారియందు అణగియున్న లేక మరుగుపరుపబడియున్న సామర్థ్యములను వ్యక్తీకరించుటకు వారికి యవకాశమీయదు. గౌరవ పదవుల ముఖద్వారములన్నియు కొంచెమెచ్చుతక్కువగ వానికి ప్రతికూలముగ మూయబడియున్నవు. పనిచేయుటకై వారిని ప్రేరేపించునదేమున్నది? ఇండియన్ యూనివర్సిటీల వైద్యపట్టభద్రులకు ఔషధ (Medicine) భాగమునందుగాని, శాస్త్ర (Science) భాగమునందుగాని మొదటిశోధనజ్ఞానమును అభివృద్ధిపరచుటకు ఇండియన్ మెడికల్ కాలేజీలలోని విద్యార్థులకు గొప్పఉద్యోగముల నొప్పుకొనని ఇప్పటి ఆచరణలోని పద్ధతి ప్రోత్సాహపరచుచుండలేదు. మఱియు బహిష్కారపరచెడి ఈపద్ధతి, హిందూ వైద్యసామర్థ్యమును నిరుత్సాహముగ జేయుచున్నది.

ప్రపంచమందలి తక్కిన దేశములవారికి హిందూదేశము వైద్యమును శస్త్రచికిత్సను ఆచరించునట్లు గడచిన కాలముల

యం దుపదేశించియుండెను. శారీర శాస్త్ర (Anatomical) జ్ఞానమును సంపాదించునిమిత్తము* శవచ్ఛేదమునకు త్వరపునొసంగి ప్రోత్సాహపరచిన భారతీయ వైద్యులను ఎక్కువగ పొగడుట సరికాదు. వైద్యసంబంధ కారకులు (Medical Agents) గా లోహాదుల నుపయోగించినందుకును, శస్త్రచికిత్సయందు ముఖ్యభాగమైన§రినోప్లాస్టి (Rhinoplasty) అనబడు ముక్కుకు సంబంధపడు శస్త్రచికిత్సకును, ప్రపంచమంతయు హిందూదేశీయులకు కృతజ్ఞులైయున్నారు. 1878-వ సం॥ మున మద్రాసు యూనివర్సిటీ కాన్వొకేషన్ సమయమున కీర్తిశేషులైన సర్జన్ జనరల్ సర్ నెల్ గారు మాట్లాడుచు నొసగిన యీ క్రింది యభిప్రాయమును సూచించుటమాత్ర మావశ్యకముగనున్నది. "గ్రీకులు అలెగ్జాండరుతో హిందూదేశమునకేతెంచినపుడు వారు వేనినిగూర్చి యాశ్చర్యమొంది పొగడియున్నారో అట్టి నాగరకత్వచిహ్నములయందు వైద్యాచరణ మెక్కువ యభివృద్ధియందున్నటుల వారు కనిపెట్టిరి. ' గ్రీకువైద్యులు పాము కాటుకు మందును కనిపెట్టియుండలేదు. అయినను, హిందువులు అట్టి దురదృష్టకరమగు బాధకు లోబడినవారిని స్వస్థపరచిరి ' అని ఏరియన్ అనునతడు చెప్పుచున్నాడు. ' అలెగ్జాండరు తనచుట్టును చతురతగల హిందూవైద్యుల నుంచుకొని యుండుతరి, పాములచే కరువబడినవారెవరైనను సౌఖ్యమును పొందునిమిత్తము తన రాజమందిరమునకు వెంటనే రావలయు

---

* సుశ్రుత శారీర - అ. 5.   § సుశ్రుత సూత్ర - అ. 17.

సని శిబిరమునందంతటను శాసించునట్లు ఆజ్ఞాపించెను ' అని నియారోగస్ అనువాడు చెప్పెను. ఇది క్రీస్తుపుట్టుటకుపూర్వము 300 సంవత్సరములపుడు జరిగెను. 2000 సంవత్సరములకు పిదప, ఇపుడు 1878 వ సం॥ర ములో బ్రిటిషు ప్రభుత్వమును కలిగియున్నాము. డాక్టర్ షార్ టర్ అనునతడు మిక్కిలి విలువగలిగియుండి పోగొట్టుకొనబడిన జ్ఞానమునకై బహుమతిని వృధాగానిచ్చుచున్నాడు. ఈ వైద్యులే ఇతర వ్యాధులను కూడ నెమ్మదిచేసినట్లు చెప్పబడుచున్నారు. హిందూదేశమును అలెగ్జాండరును అతని పిదపవారును దండెత్తినకాలమున, గ్రీకులు ఎక్కువ విషయములను స్వయముగ నేర్చుటయేగాక, తరువాత యీజిప్టుదేశస్థులవలనగూడ గ్రహించిరి. పూర్వఖండమందలి యేదోయొక రహస్యమైన జాతివారివలన వారు కొంత జ్ఞానమును సంపాదించిరి. నిస్సందేహముగ నది హిందూదేశమే అయ్యుండును. హిందూదేశ మెడల మనకున్న బాధ్యత కొంత కాలమైనపిదప స్వయముగ సంభవించుచున్నది. అలెగ్జాండ్రియా నాశనముచేయబడిన పిదప బాగ్దాదున కాలిఫులు రాజ్యమేలునపుడును, అది గొప్ప విద్యాపీఠముగ చేయబడినపుడున్ను, వైద్యము ఎక్కువ సామర్థ్యము కలదిగను జయము కలదిగను చేయబడెను. అరేబియాయందు నివసించు నిమిత్తము హిందూవైద్యులు పిలువబడిరి. క్రీ. శ. 773 - వ సం॥ర మున హరూన్, మరసూరుల కాలములో చరకము, సుశ్రుతము,

మాధవనిదానము భాషాంతరమునకూర్పబడి అరేబియనులచే నేర్పబడియుండెను మధ్యధరా సముద్రముచుట్టును మహమ్మదీయుల దండయాత్రల యలలు కొట్టినపుడు, వైద్యమును, గణితశాస్త్రమును, అరేబియనులు స్పెయినుదేశమునకు దీసికొనివచ్చిరి. అవి ఇటేలియా ద్వీపకల్పమునందు సారసేనిక్ కాలేజీలయందు అనుగుణముగ నేర్పబడెను. అరేబియనులు గొప్ప వైద్యులుగ నుండుటయేగాక రసవాద శాస్త్రమున గూడ ప్రసిద్ధులైయుండిరి. ఏశాస్త్రములు ప్రస్తుతకాలపు వివిధమైన ఔషధులయొక్కయు రసవాదశాస్త్రముయొక్కయు జ్ఞానమున కాదిగా నుండెనో, అట్టివాని పునాది అరేబియనుల యుపదేశములవలన నిర్మింపబడియున్నందుకు మనము కృతజ్ఞులమైయున్నాము. వైద్యశాస్త్రము ఆవశ్యకమైన సౌఖ్యము రక్షణతో సంబంధించిన ప్రతిదానితో ఏకీభవించియున్నది. అది కలిగిన రోగములను మాన్పుటయేగాక వానిని రాకుండగూడ చేయును. మరియునది మూలపదార్థముల (Elements) ను, లేక భూతములనుగూడ పరిశోధించుచున్నది. మీ పూర్వీకులు గూడ ఇప్పటికాలపు నాగరకతను ఇతరులకంటె ముందుగనే ఆరంభించినట్టు నాకు తోచుచున్నది. సమస్తప్రాణులకు చాలినంత శుభ్రమైన జలము ఆవశ్యకముగ నుండవలెనని ఐరోపా ఖండములోని పెద్దపట్టణముల వారందరును మొరబెట్టుచున్నారు. ఇప్పటి స్వస్థవృత్తము (Hygiene) న నుడువబడిన

విషయములకు మనమెక్కువ కృతజ్ఞులమై యుండవలెను. నేను పొరబడియుండనియెడల మనపూర్వీకు (ముఖ్యముగ బ్రాహ్మణు) లీ విషయమును అనేకశతాబ్దముల క్రిందటనే గ్రహించియుండి రని తలచుచున్నాను॥ ఇంతవరకు డాక్టర్ షఫ్ నెల్ గారు రిమార్కు చేసి యుండిరి.

మతాచారములు హిందూదేశమునకు ఎట్టియుపకారమునైనను చేసియున్నయెడల అది హిందూ దేశీయులలో వంశపరంపరగ వచ్చెడి ప్రతిభను కాపాడుకొనుట వలననే సంభవించియుండును. ఒకకాలమునుండి మరియొకకాలమునకును తండ్రివలన కొమారునకును, నిపుణతయు అనుభవమును కలుగుచున్నది. ఎక్కువ సామర్థ్యముగల వైద్యుల నైపుణ్యమును నిష్ఫలముగజేసి గూఢముల్లై చాలాకాలమువరకు నిలిచియున్న వ్యాధులను నిర్మూలించి హిందూదేశ పద్ధతుల ప్రకారము చికిత్సయొనర్చి వానిని నివృత్తిపరుచు వైద్యులను ఈ దినమునగూడ మనము తప్పక మెచ్చుకొనవలసి యున్నది. ఇప్పటికాలమున ఇండియన్ మెడికల్ సర్వీసులోని హారెట్టి యుద్యోగముల కెదురుచూచుచున్నారో అట్టివానిని నిర్వహించుటకు దగిన సామర్థ్యము సరియైన ప్రోత్సాహమున్నయెడల తమకుగలదని అనేకవేల సంవత్సరములుగా ఈ వైద్యవృత్తి నవలంబించినవారు తాము చేయు కార్యములచేత ప్రదర్శింప గలరు.

వంశపారంపరగ వైద్యముచేయు కుటుంబములలోని నొకరు కొద్దికాలముక్రిందట శవమును కోయుటకు ఆసియా ఖండములో గాకపోయినను హిందూదేశీయులలో మొదటివారుగనున్నారని చెప్పుట యిచ్చట తగినవిషయముగనున్నది. కలకత్తా మెడికల్ కాలేజీయొక్క యభివృద్ధికి కారకులుగ నున్న డాక్టర్ మౌట్ గారు ఈవిషయమునుగూర్చి యీక్రింద కనుపరచిన విధముగ చెప్పియున్నారు. "హిందువుల యాచారములను నడవడికలను యోచించినయెడల మనుజశవమును మున్ముందు బహిరంగముగ ఛేదించిన హిందువులలో నగ్రజాతివాడును కలకత్తా మెడికల్ కాలేజీకి సంబంధించిన పండితుడును నైన మధుసూదన గుప్తగారు నితరులెవ్వరును స్వదేశమునకు మహోపకార మొనర్చినవారి పేరులలో నుండతగినవారు లేరు. వారి సాహసంబును భూతదయయు మిక్కిలి కొనియాడదగియున్నది."

హిందువులు స్వాభావిక జ్ఞానముకలవారు కారనియు, వారికి సహజవివేకము లేదనియు నెవరును ఇదివరకు చెప్పియుండలేదు. వారు శ్రద్ధనువూనిన ప్రతివృత్తియందును ప్రశస్తి గాంచియున్నారు. తమవృత్తుల నిర్వహించు విషయమున నసమర్థులుగ నున్నారని హిందూవైద్యులను నిందించువారు (నిందకు అవకాశమేయున్నయెడల) అట్టినింద కేవలము వైద్యులకుమాత్రము సంబంధించక వారిగురువులనుగూడ ననువర్తించునను విషయమును కనుగొనలేకయున్నారు. హిందూ

దేశమున వైద్యవిద్య 1835-వ సం॥ నుండి ప్రారంభమైనటుల తేలుచున్నను, న్యాయశాస్త్రము(లా), ఇంజనీరింగు, సామాన్యములగు నితరశాస్త్రములు వీనిప్రచారము ఇటీవలనే జరిగియున్నది. హిందూలాయర్లు తమవాగ్వాదమునకు సంబంధమగు నిపుణతచే న్యాయసభలకును, వకీళ్లసంఘమునకును మెప్పును కలుగజేసియున్నారు హిందూదేశపు ఇంజనీయర్లుకూడ తమకార్యములయందు తెలివితేటలను కనుపరచియున్నారు. హిందూ ప్రొఫెసర్లు తమసామర్థ్యమువలనను, ఎక్కువగ చదివియుండుటవలనను, విద్యార్థులవలన మర్యాదను పొందుచున్నారు. పైజెప్పబడిన వృత్తులన్నిటియందును హిందువులు ఆక్రమించుకొనియున్న గొప్పగొప్ప ఉద్యోగములయందు వారు అంత బాగుగ పని చేయుచున్నపుడు, వైద్యవృత్తియందుమాత్రము వారు పొందదలచిన గొప్పయుద్యోగములయందలి కార్యములను నిర్వహింపనసమర్థులని వారినియేల తలచవలయును? వారినటుల తలచుట న్యాయమేయగునెడల, ఇపుడు హిందూదేశమున వాడుకయందున్న వైద్యవిద్యాపద్ధతి న్యూనతగలదియని యెంచవలసియున్నది. అయిన నటులతలచుట ఇండియన్ మెడికల్ సర్వీసునందు సర్వసామాన్యమగు మెంబర్లయొక్కయు, ఇండియన్ మెడికల్ కాలేజీలలో ముఖ్యముగనున్న ప్రొఫెసర్లయొక్కయు గొప్పయర్హతలనుగూర్చి యోచించునెడల బొత్తిగ నసంగతమయినదిగను, వాదమునకు నిలువనిదిగను ఏర్పడుచున్నది.

ద్రవ్యవినియోగ విషయమునుగూర్చి విచారించినను, హిందూవైద్యపట్టభద్రులను గొప్పయుద్యోగములయందు నియమించుట మెక్కువగ కోరతగిన విషయముగనున్నది. మరియు నందువలన గవర్నమెంటువారికి ఎక్కువద్రవ్యము మిగులగలదు.

గొప్ప వైద్యోద్యోగములయందు కలిగెడి లాభములు, ఎక్కువకష్టపడి పనిచేసి ప్రతిష్ఠను సంపాదించులాగున హిందూ వైద్య పట్టభద్రులను పురికొల్పుచున్నవి; అందుచే నీదేశమందలి వైద్యాభివృద్ధి మిక్కిలి కొనసాగగలదు.

పందొమ్మిదవ శతాబ్దముయొక్క మొదటిసగభాగమున 1843-వ సం॥ రమున ప్రచురింపబడిన సర్ థామస్ వాట్సన్ యొక్క మెప్పొందదగిన "వైద్యచికిత్సాచరణమును వైద్యశాస్త్రముయొక్క ముఖ్యాంశములను గూర్చిన యుపన్యాసములు" అనుపుస్తకమే వైద్యచికిత్సాచరణ (Practice of Medicine) విషయక గ్రంథములలో ముఖ్యమైనది సర్ థామస్ వాట్సన్ (1792-1882) తొంబదియేండ్లు దాటినవెనుక మృతిజెందెను. ఆయన పుస్తకమందలి విషయముల సాగసైన ధోరణిని బట్టియు, విషయములు స్పష్టముగ వ్రాయబడియుండుటను బట్టియు, అది యందరిచేతను తగినటుల సన్మానమునుపొంది ఇరువదియైదు సంవత్సరముల పైకాలములో ననేకపర్యాయములు ముద్రింపబడెను. 1896-వ సంవత్సరమున బొంబాయినగరమునందు ప్లేగు ప్రారంభించినపుడు ఆవ్యాధినిగూర్చిన

కొంతవిషయమును కనుగొనుటకై నేనాపుస్తకమును చదివి తిని. "ప్లేగువ్యాధిని నేనెపుడును చూచియుండనందుకును, నేనెపుడును దానిని చూడకుండ నుండుటకును, భగవంతుని ప్రార్థించుచున్నాను" అనెడి మాటలనుమాత్రమే నేనందు చూచియుంటిని.

ఛార్లెస్ ముర్చిసన్ (1830-1879) బంగాళాదేశమందలి యుద్యోగమున 1853-వ సం॥ రమున ప్రవేశించి 1855-వ సం॥ రములో బర్మాదేశముయొక్క శీతోష్ణస్థితిని వ్యాధులను గూర్చిన యొకపుస్తకమును ప్రచురించెను. ఆయనకు జ్వరములను గురించిన యాశ్చర్యకరమగు ప్రత్యేకజ్ఞానముండెను. మరియు నాతడు యకృత్తు(Liver) కు సంబంధించిన వ్యాధులనుగూర్చి ప్రత్యేకసామర్థ్యమును పొందిన యొకప్రామాణిక గ్రంథమును వ్రాసెను.

ఇండియన్ మెడికల్ సర్వీసుకు సంబంధించిన జేమ్సు ఎస్ డెయిల్ అనువారిపేరు, యోగనిద్ర (హిప్నాటిజమ్) తోడను ప్రత్యేకముగ శస్త్రచికిత్సా ఛేదనలతోడను సంబంధించిన హిప్నాటిక్ అనస్థేనియా (Hypnotic anaesthenia) యను దానితోడను, ముఖ్యముగ వాడుకయందున్నది. స్కాటిష్ శస్త్రచికిత్సకుడగు జేమ్సు బ్రెయిడ్ అనువాడు (1796-1861) ప్రాణుల యాకర్షణాశక్తి (Animal magnetism) యొక్క శాస్త్రజ్ఞానమును సరిగ గ్రహించెను; ప్రకాశమైన జడపదా

ర్థమువంక నచలమైనదృష్టిని నిలపినయెడల తనంతట వచ్చెడి పూర్తియైన గాఢనిద్రను పొందవచ్చునని శోధనలవలన నాతడు కనిపెట్టెను. లండన్ యూనివర్సిటీ కాలేజీయొక్క జాన్ ఎల్లిట్‌సన్ (1791-1868), సర్జికల్ ఆపరేషనులయందు యోగనిద్రను కల్పించుటకు మొట్టమొదటివాడుగనున్నాడు. జేమ్సు ఎస్‌డెయిల్ (1808-1859), హిందూఖయిదీలకు యోగనిద్రను గల్పించుటకు 1845-వ సం॥ రములో ప్రారంభించెను. ఆయన నూటికి పైబడిన ఆపరేషనులను జయప్రదముగ నొనరించెను. వీనిని బెంగాల్ డిప్యూటీ గవర్నర్ గారు ఎక్కువ కఠినముగ పరీక్షించియుండెను. మరియు నతడు 261 బాధలేని ఆపరేషనులను గుర్తుచేసియుంచి నూటికి 5½ వంతున ప్రాణహాని (చావు) కలిగెనని వ్రాసియుంచెను. దీనిని తనపుస్తకమునందు "హిందూదేశమందలి వశీకరణవిద్య (Mesmerism)" (1846) అను పేర వర్ణించెను. "వ్యాధులయందుతప్ప యోగనిద్ర మైమరపును ప్రత్యేకముగ సులభముగ మనసునకు రానియ్యకుండుటలో తమకు సామర్థ్యమున్నదని తలచు ఐరోపావారు, మెత్తని మనస్సును జంకెడుస్వభావంబును గలిగిన హిందువులకు నేకీభవించరని "ఎస్‌డెయిల్" అనునతడు కనుగొనెను" అని డాక్టర్ గారిజన్ తనస్వదేశమైన స్కాట్లెండునకు మరలివచ్చినపిదప చెప్పెను. హిందూయోగులవలన యోగనిద్రను ఎస్‌డెయిల్ నేర్చుకొనలేదా? దీని ప్రత్యు

త్తరమునకు నేను కొంచెమాగెదను. బొంబాయిరాజధానిలో ననేక కారాగృహముల (Prisons) కు ఇప్పుడు ఇన్‌స్పెక్టర్ జనరల్‌గానున్న కర్నల్ జాక్సన్ అనువారు, అట్టి పరిశోధనల యందు తనఖయిదీలలో కొందరిని ఉపయోగించుటకు సమ్మతించెదరా ?

పందొమ్మిదవ శతాబ్దమున బ్రిటిషువైద్యమునకు కలిగిన ముఖ్యాకృతి, ఆంగ్లో ఇండియనులైన శస్త్రచికిత్సకుల కార్యములవలననే యేర్పడెను. 1600 - సం॥రమున క్వీన్ ఎలిజబెత్ వలన ఈస్టుఇండియా కంపెనీవారు ప్రత్యేకాధికారమును పొంది 1612-వ సం॥ రమున వారి మొట్టమొదటి వర్తకస్థానమును ఏర్పరచుకొనిరి. చాలాకాలము క్రిందటననగ, 1645,వ సం॥రమున ఆగ్రాపట్టణమునందలి షాజహాన్ కోర్టునకు సూరత్ పట్టణమునుండి పంపబడిన "గేబ్రియల్ బోటన్"అను శస్త్రచికిత్సకుడును 1714-17 లోగా ఢిల్లీపట్టణమునకు ఆపనిమీదనే పోయియుండిన "విల్లియమ్ హామిల్టన్" అను శస్త్రచికిత్సకుడును, వర్తకముచేసికొనుటయందు కంపెనీకి కావలసిన సదుపాయములను అధికారమును సంపాదించుటయందు ముఖ్యులైయున్నారు. కడపట బొంబై, కలకత్తా, మదరాసు అనుమూడు ప్రదేశములు గొప్పవర్తకస్థానములుగానేర్పడెను. 1757-వ సం॥రమున లార్డు క్లైవుప్లాసీయుద్ధమున జయమొందువరకును ఇండియన్ మెడికల్ సర్వీస్ వారు దూరప్రదేశమందలి (Colonial)

వైద్యచికిత్సయుంగాను, ఉష్ణదేశమందలి (Tropical) వైద్యము నందును ఎక్కువగ పనిచేసియుండుట మనముచూచియుండ లేదు. జాన్ లిండ్ అనువాడు (1716–94) ఉష్ణదేశమందలి రోగౌషధుల (Tropical Medicine) ను గురించిన మొట్టమొదటిగ్రంథము ను 1768-వ సం॥ రమున ప్రచురించెను. ఆతని గొప్పగ్రంథము నకు పిమ్మట, "హిందూదేశ శీతోష్ణస్థితినిగురించియు వ్యాధులను గురించియుప్రసిద్ధిజెందిన జాన్ పీటర్ వేడ్ (1716–93), విల్లియమ్ హంటర్ (1804) సర్ జేమ్సు అన్నెస్లె (1825) విల్లియమ్ట్వినింగ్ (1832), సర్ జేమ్సురాన్యాల్డ్ మార్టిన్ (1841), ఆలెన్ వెబ్ (1848), ఛార్లెస్ మోర్ హెడ్ (1856) వ్రాసిన పుస్తక ములు గంభీరాకృతి వెలువడెను. అందు, గుడేవ్ అనువారు వ్రాసిన ఉష్ణదేశస్థితులను దెలుపు శాశ్వతమైన చిన్నపుస్తక ము (1844) ను గూడ మరువగూడదు." అని డాక్టర్ గారిజన్ గారు చెప్పుచున్నారు. హిందూదేశ సైన్యములోని శస్త్రచికి త్సకులు సాధించిన కార్యములలో ముఖ్యమైనవి ఎవ్వియనగ— ఎండదెబ్బను గురించిన మొట్టమొదటి ప్రసిద్ధమైన చారిత్రము (గ్రీన్, బార్ క్లె, లాంగ్ మోర్ మరియు నితరుల చరిత్రములు మనకు తెలిసియున్న సంగతులలో నెక్కువగ ననుసరించియు న్నవి); పలువిధములైన పాములకాటులు, స్వదేశీయుల విష ప్రయోగములు, పూర్వదేశములందలి రోగౌషధుల (నార్మన్ ఛీవర్స్) (Norman chevers), లయ్యన్ (Lyon) బారి

(Barry)గుణములు,—వీని వివరణములు; ఓషధిశాస్త్రమనబర
గు వృక్షాయుర్వేదము (Botany), జంతుశాస్త్రము (Zoology)
భూగర్భశాస్త్రము (Geology), పలుజాతి మనుజులనుగురించి
వివరించుశాస్త్రము (Ethnography) వీనియొక్క జ్ఞానమును
వృద్ధిపరచుట కొనర్చిన తోడ్పాటులు; కలరా, బెరిబెరి
(ఒకవిధమైనసంజు), స్కర్వీ, అతిసారము (డిసెంటరీ,) కుష్ఠు
(లెప్రసి,) మదురఫూట్, శ్లీపదము (ఫైలేరియల్ ఎలిఫెంటి
యాసిస్,) బ్రిటిష్ఆర్మిబాంబూప్లి ఎంట్, మొక్కలమీద చికి
త్సకోతల సంబంధమైన హిందువుల ఆయుర్వేదీయ శల్యతంత్ర
పఠనాపద్ధతి (Hindu method of teaching surgical incision upon plants)-వీని మొదటిచారిత్రములునై యున్నవి.

ఇరువురు, లేక, ముగ్గురు ఆంగ్లో ఇండియన్ శస్త్రచికి
త్సకులు, సర్పవిషయక చారిత్రమున నున్నతపదవిని పొందియు
న్నారు. (1) పాట్రిక్ రస్సెల్ (1727 - 1805) - సర్పవిషయక
జ్ఞానమున, హిందూదేశమందు సర్పములనుగురించిన యాతని
చారిత్రమే మొదటిదిగనున్నది. మరణమును కలిగించు పాముల
చరిత్రాంశమున నాతనిపేరునశించనిదిగనున్నది. గొలుసులతో
నుంచబడు "ఘనాస్" అనుపేరుచే పిలువబడు క్రూరసర్పము,
ఇపుడు శాస్త్రోక్తముగ "డబోయ్ రస్సెల్లి" అను పేరుచే
తెలియబడుచున్నది. (2)సర్ జోసెఫ్ ఫెయిరర్ (1834-1907)-
ఇతను ఇండియన్ మ్యూటినీలో నుత్సాహముగ పనిచేసెను,

మనదేశమందెల్ల పురుషు కిసిపెట్టిన ధైర్యశాలురైన శస్త్రచికిత్స కులలో నాతడొకడుగనున్నాడు. "థనాటోఫీడియా" అని పిలువబడిన యాతని యుత్కృష్టగ్రంథము 1872-వ సం॥రమున ప్రచురింపబడెను. ప్రపంచస్వభావమునుండి తీసికొనబడిన సొగసైన యుదాహరణములును కల్పనాశక్తియు, తెలివిగల బంగాళాదేశపు యువనులచే నమ్మబడుచున్నవి. ఈగొప్పగ్రంథము జంతుశాస్త్ర (Zoology) సంబంధమున మహాకావ్యముగనున్నది. అయ్యది యీదేశమందలి క్రూరసర్పములనుగూర్చి వివరించుచున్నది. (3) బొంబై నాచురల్ హిస్టరి సొసైటివారి జర్నలులో అప్పుడప్పుడు ప్రచురింపబడు, డాక్టర్ వాల్‌గారి యొక్క నెమ్మదిగను, వరుసగను, నిశ్చయముగను, జరుగుచున్న హిందూదేశపు సర్పములను గురించిన పని యింకను కొనసాగుచున్నది.

ఇండియన్ మెడికల్ సర్వీస్ వారిలో బొంబై ప్రాంతమున అత్యద్భుతముగ పనిచేయు మనవారిలో నొకరగు డాక్టర్ హిర్రిచ్ వార్డిక్ కార్టక్ అనువారు, మదురఫూట్, స్ప్రిల్లింఫీవర్, కుష్ఠు (లెప్రసి), వెసికల్ కాల్కులస్ అనువానిని దుర్భిణీయంత్రముచేకనిపెట్టిన ఆదిరూపములు ఆయనవైద్యశాస్త్రమున నప్రమత్తతో చేసిన పరిశోధనాఫలములై యున్నవి. యన్.సి. మాక్‌నెమరాఅను నతడు కలరాను గురించియు, కంటిరోగములను గురించియు పరిశోధించెను. ఈవిషయమున థాసెన్ పేరుగూడనుదా

హారించవలసియున్నది. లియొనార్ క్ రాజెర్ స్, హిందూదేశపు జ్వరములనుగురించి విశేషముగ వ్రాసియున్నాడు. బోంటి యస్ (1642), టల్ ప్ (1652)—వీరలచే 17-వ శతాబ్దమున బెరి బెరి యను వ్యాధి వర్ణింపబడియుండెను. జాన్ గ్రాంట్ మ్యాల్ కోమ్సన్ (1835) యొక్క గ్రంథము, ఈవ్యాధి యొక్క ఇటీవల జ్ఞానమునకు మూలాధారముగ నున్నదని ఎల్లపుడు తలచబడుచున్నది. పిచ్చినిగురించి వ్రాయుటలో జ్ఞప్తియుంచుకొనదగిన డాక్టర్ అయిర్ లెండ్ పేరును, 1868-వ సం॥రమున, మొదటి అఫీషియల్ ఇండియన్ ఫార్మకోపియాను, 1860-వ సం॥రమున బజారున సాధారణముగనుండు ఔషధములనుగురించిన మంచిపుస్తకమును, 1878వ సం॥రమున బిబ్లియొథెకా థెరాప్యూటిక (bibliotheca therapeutica) ను పూర్తిచేసి పిదప స్వస్థవృత్తము (hygiene) నందు మంచి పనిని చేసిన యెడ్వర్డు జాన్ వేరింగ్ (1819-91) యొక్క పేరును, నేను మరువజాలకున్నాను. జంతుశాస్త్రము (Zoology) న కర్నల్ జ్యాయకార్ యొక్క గ్రంథము మెచ్చ దగ్గ దైనదిగ నున్నది.

దురదృష్టవంతులైన పిచ్చివాండ్ర నుద్ధరించుటకై పాటు పడినవారి పవిత్రనామములను నేను మరువకుందును గాక. పిచ్చివాండ్రను బంధమున నుంచని చికిత్స, పరిశుభ్రవాయువుంగల బయలునందలి చికిత్స—ఇవి జాన్ కనొల్లె (1856) గారిచే

నభివృద్ధి చేయబడెను. అందుచే నితనికి శాశ్వతకీర్తి కలుగుచున్నది. మనుజస్వభావజ్ఞానమైన యీచికిత్స, ట్యూక్ వంశమువారు పాటుపడుటచే నాశనబడక యీదినమువరకు నాచరింపబడుచున్నది. అందు డేనియల్ హాక్ ట్యూక్ అనునతడు జాన్ ఛార్లెస్ బక్‌నిల్ అనువానికి తోడ్పడుటచే, నిద్దరు నమోఘమైన ఫలితమును పొందియున్నారు. విల్ హెల్మ్ గ్రెసీనియర్ (1817–68), పురాతనకాలమునకు సంబంధించిన గూఢతత్వమును (mysticism) చాలవరకు పారదోలి, న్యాయమైన (rational) ఆత్మతత్వజ్ఞాన (psychological) విభజనము (analyses) తో సంబంధించిన స్పష్టమైన పొరబాటున కవకాశములేని రోగముల యుదాహరణముల (clinical proof) కనుపరచి, రోగచిహ్నముల (psychic disorders), క్రమమైన చికిత్సను స్థాపించెను.

చర్మరోగవిషయమున సర్ ఎరాస్ మస్ విల్‌సన్ (1809–84) చెప్పనర్హుడు. పందొమ్మిదవ శతాబ్దమున చర్మరోగములకు సంబంధించిన శాస్త్రవిషయమును లేక చిన్నపురుగుల కారణమును ప్రబలుటకు ప్రసిద్ధికెక్కెను. కంటికి కానరాని దుర్భిణియంత్రమువలన కనుగొనబడు చిన్న పురుగులవలన పెక్కుచర్మవ్యాధులు కలుగుచున్నటుల సబొరాడ్, అన్ను అనువారిచేత కనిపెట్టబడెను. హెబ్రా (1837) అనువారి గ్రంథము ఇచ్చుట చేర్కొనదగియున్నది. మనుజశరీరము

దంతటను జనించు చర్మరోగములనుగురించి యాతఁ డొక పర సీయగ్రంథమును వ్రాసెను (1884).

బొంబైయందు వ్యాపించియున్న వ్యాధులను కుదుర్చుటయందును కుదుర్చు నుపాయములను కనిపెట్టుటయందును, ఇపుడు బొంబైలోనున్న ప్రసిద్ధులైన వైద్యులును శస్త్రచికిత్సకులును, తమ నూతనకార్యములచేతను, సాటిలేని సామర్థ్యముచేతను, ఉదాహరణముగ తీసికొనదగినంత సహాయ మొనర్చుచున్నారు; అట్టివారిపేరుల నుదాహరింపక యుండదగదు. ముఖ్యముగ హిందువులపేరులనే యేరి యుంచితిని. ఇట్లు చేయుటయందు అసూయను కలిగించు భేదమును పాటించలేదు. శస్త్రచికిత్సయందు అనుభవభాగమున డాక్టర్ మాసీనా, డాక్టర్ భజేకర్ ఛిటేల్ అనునీయిరువురును తమకుంగల పరస్పర శ్రద్ధవలనను, నేర్పరితనమువలనను, చిరస్థాయియగు మంచిప్రతిష్ఠను సంపాదించియున్నారు. ధనవంతులును బీదలును వారియెడల నెల్లప్పుడును కృతజ్ఞతగలవారై యున్నారు. ప్రకృతకాలమున వివిధవైద్యకసాహాయ్యమున కనుకూలమగు వస్తుసంచయముతో సమర్పబడియున్న స్వీయఆతురాలయముల(ప్రయివేటుఆసుపత్రులు)ను వారిరువురును నునిచియున్నారు. హిందూశస్త్రచికిత్సకు లిదివరకుచేసిన కార్యములకును, ఇక ముందు చేయనున్న పనులకును, బ్రతికియున్నవారిలో వీరిరువురును మార్గదర్శకులుగనున్నారు. గ్రాంటుకాలేజీలో (1876-1879)

bating stage) ని గురించిచేయు పరిశోధనలయందు వారుత్సాహముతో పనిచేయుచున్నారు. నారికురుపుయందలి పురుగుయొక్క జీవితము (Life history) నుగురించి నెమ్మదిగ బాగుగ నాలోచించి పలువిషయములను చెప్పివ్రాయు సామర్థ్యము వారికి సహజముగనున్నది. అట్టిరిపోర్టు ఎపుడు బయలువెడలునాయని నేను ఆశతో కాచుకొనియున్నాను నారికురుపు మనుజశరీరమున త్రాగెడి నీటిమూలముగ ప్రవేశించునా? లేక, కొన్ని సంవత్సరముల క్రిందట డాక్టర్ మోర్ హెడ్ గారు చెప్పినటుల అన్నకోశముగుండ ప్రవేశించునా? లేక, 1911-వ సం॥రమున నేనూహించినటుల చర్మముగుండా ప్రవేశించునా? ఇయ్యది యిప్పటివరకు తెలియని రహస్యముగనున్నది.

ఎలుకలయందు చొచ్చి, ప్లేగు (మహామ్మారి లేక, బొబ్బలరోగము) ను కలిగించు బొంబాయి త్రుళ్లుపురుగు (Bombay flea) ను దుర్భిణియంత్రము (మైక్రొసుకోపు) ద్వారా పరీక్షించి కనుగొను నేర్పరితనమును, ఇపుడు బెంగుళూరులో (మైసూరుస్టేటు) సివిల్ సర్జనుగానున్న నాస్నేహితుడగు డాక్టర్ వి. యల్. మ్యాంకర్ అనునతడు ఇదివరకే కనుపరచి యున్నారు.

1915-వ సం॥ 7 వ డిశంబరున బొంబై శాసననిర్మాణ సభయందు హానరబిల్ లెఫ్టెనెంటు కర్నల్ జాక్సన్ గారు చేసిన యుపన్యాసమును, నేనిపుడు సూచించవలసియున్నది.

సారవంతమును గాక శరీరమందలి రక్తమును గాక యుండు ప్రసవపదార్థమును గూర్చి పురాతనంబగు నాయుర్వేద వైద్యపద్ధతి చెప్పువిషయమును కర్నల్ జాక్సన్ గారు నిరాకరించుచున్నారు. బ్రిటిషు వైద్యముయొక్క ఇప్పటి కాలపు పశ్చిమదేశపద్ధతికి సంబంధించిన జంతుదేహశాస్త్రము (Human physiology) లో నావిషయము సంబంధించి యున్నది. ఒక్కపేరునందేమున్నది ! గులాబి పువ్వును, థార్న్ మూగ్, అని పిలువుము. అపుడుగూడ, నది గులాబి పువ్వుగనేయుండి మార్పుజెందక సొగసైనపరిమళము నిచ్చును. ఇంగ్లండులోని హెలియొట్రోప్ (Heliotrope) అనుదానిని గుమ్మడికాయయని చెప్పుము. అది, ఇంగ్లండుదేశపు తోటలలో పెరిగి మధురముగనుండు హెలియొట్రోప్ గనే యుండును.

వాయువు (Vayu) అనునది, సెన్సరి, మోటార్ నరములను కలుపుకొని లోనికి, బయటికి వచ్చెడి నరముల కుటుంబమునకే యర్థమగును. అది యింద్రియజ్ఞానమును(Sensation) స్నాయువుల చలనమును (Motion of the muscular System) కలిగించుచున్నది. అది శరీరమునందలి చిన్న బిలముల కదలికను కనుపరచు నరముల శక్తియనియు, మరియు కదలికయందుండు ఏదైనను సాధియనియు, గ్రహింపవలెను. ఈ విషయమున వాయువు అనునది, నిలిచియుండు గాలి (Stagnant air) గాక కదలికయందలి గాలి (Air in motion) యని యర్థము.

అదేవిధమున, 'సూర్యుని వేడిమి' (Solar heat) అను పదములయొక్క అర్థమునుగూడ కర్నల్ బాక్సర్ గారు వేరు విధమున చెప్పియున్నారు. సూర్యుని వేడిమి అనునది, జంతు దేహ ధర్మశాస్త్రము (Human Physiology) నందు మనము చెప్పు 'జంతువుల వేడిమి' (Animal heat) తప్ప వేరొండు కాదు. ఉష్ణ సామాన్యమునకు సూర్యుడు ఉత్పత్తిస్థానముగ నుండుట చేత, మన యందలి వేడిమి సూర్యుని వేడిమితో సంబంధపడియున్నది. అన్ని జంతువులు రసవాదశాస్త్రసంబంధమైన మార్పున (Chemical action) కు లోనయ్యుండుట చేత, వానిని ఆవరించియున్న నీరు, మొత్తముమీద గాలికన్న నెక్కువ వేడిమిని కలిగియున్నవి. మనుష్యుడు వేడిరక్తము (Warm-blooded) ను కలిగియున్న ప్రాణిగనున్నాడు. ఇతర స్తనతజాతిజంతువులు (Mammals) ను, పక్షులును, అదేవిధమగు రక్తమును కలిగియున్నవి. అట్లుండగా నవి చల్లని రక్తముగల (Cold-blooded) జంతువులగు చేపలు, ప్రాకెడు ప్రాణులు (Reptiles) మున్నగు వానికన్న నధికమగునుష్ణమును కనుపరచుచున్నవి. మనుష్యుడు ఉష్ణదేశ మందుగాని, శీతలప్రదేశమందుగాని, ఎండకాలమందుగాని, చల్లనిదినములలోగాని, ఒకేరీతిగనున్న వేడిమిని కలిగియుండును. ఇక చల్లనిరక్తముగల ప్రాణులు అనగ కప్పలు, చేపలు, మున్నగునవి తమచుట్టు ఆవరించియుండు వేడి, లేక చల్లనివస్తువుల స్థితి ననుసరించి తాము వేడిగగాని, చల్లగగాని నుండును.

మనుజశరీరమునందు, రసవాద శాస్త్రసంబంధమగుపని (Chemical action) జరుగుచుండుటచే, వేడిమి కలుగుచున్నది.

మెటబాలిజమ్ (Metabolism)అనునదిరసవాద శాస్త్రసంబంధమగు పనిగనున్నది అది ఉష్ణమును కలిగించుచున్నది. కుస్తీ మున్నగు పనులు చేయుటవలన ఒకానొకప్పుడు సంభవించెడి దెబ్బల (Concussions) వలనను, అవయవముల రాపిడి (Frictions) వలనను, జంతువులయందు కొంచెముగా వేడిమి కలుగుచున్నది. మనము తీసికొనెడి ఆహారమునుండియే, శరీరమున కలుగు రసవాదశాస్త్ర సంబాధమగు పనులన్నియు మొదట నుత్పన్నములగుచున్నవి. ఎక్కువ ఆహారమును తినిన యెడల నధికమగు నట్టిపని కలుగును. అట్టి ఎక్కువపని యున్నచో, ఎక్కువ వేడిమి కలుగును. అటులనే తక్కువపని కలుగునెడల, తక్కువ వేడిమి యుండును. ఇప్పటి పశ్చిమదేశపుశాస్త్రజ్ఞులుచెప్పుకొనిన యీజంతుదేహధర్మసంబంధమైనట్టియు,సర్వత్ర తలచునట్టియు, సత్యమును కర్నల్ జాక్సన్ గారు ఎరుగరా? అయిన, సూర్యునివేడిమి (Solar heat) అనునట్టిది తనకు తెలియదని వారేల చెప్పుచున్నారు? చంద్రుని వేడిమి (Lunar heat) యనుపేరుచే బరగు నింకొకరీతియగు వేడిమియున్నదా? పైత్యరసము (Bile) వలన మనుజశరీరమందు ఏ, మెటాబోలిక్ (Metabolic) పనులు జరుగుచున్నవో వారికి తెలియదా? మనుజశరీరమునందు యకృత్తు (Liver) వలన ముఖ్యముగ

కలుగ జేయబడు వస్తువే పైత్యరసము. క్రొవ్వుపదార్థములును నూనెవస్తువులును ఆహారపదార్థములతో కలిసి జీర్ణాశయము (Stomach) లోనికి బోవుచున్నవి. అవి యచట జీర్ణింపబడక గ్రహాణ్యాశయమందు (Duodenum) ప్రవేశించి యచట పైత్యరసము, మధురరసము (Pancreatic juice) యొక్క సమ్మేళనము జేత పాలవంటిపదార్థముగా చేయబడుచున్నవి. మరియు నది సూక్ష్మాంత్రము (Small intestines) నందు జొచ్చి ధాతుప్రవాహినుల (Lacteal glands) చేతను, శోషరసగ్రంథుల (lymphatic glands) చేతను, పీల్చబడి, పిదప శోషవాహికల (lymphatics) యందు జొరబడుచున్నది. కట్టకడపట నది, రసక్షీరవాహిని (Thoracic duct) ద్వారా మెడమన్నైపు సబ్‌క్లేవియన్ సిరల (Subclavian vein) యందు ప్రవేశించుచున్నది.

చిన్నపురుగులులోనగు సమస్తప్రాణులు, తాము తినెడి యాహారపదార్థములవలన చేకొనెడి వస్తువులను తమయందలి టిష్యూల (tissues) యందు చొప్పించి వానిని తమశరీరమందలి ముఖ్యములైన వస్తువులుగా చేయు కార్యములకే మెటబాలిజమ్ అనుపదము వర్తించునని నేను తలచుచున్నాను. ఈవిధాన (process) భాగమునకు, అస్సిమిలేషన్ (Assimilation) అని పేరు. ఇంతియకాక, ప్రాణేంద్రియములు, తాముచేయు కార్యనిర్వహణముచే శక్తి (energy) ని నిలువజేయుచున్నవి. అట్టి

నిలుపుటయందునను శక్తి బహిర్గతము కావచ్చును అట్టుల బయలుపడినశక్తి, పెద్దజంతువులయందు స్నాయువులు (Muscles) చేయు పనులుగాని వేడిమిగాని ప్రత్యక్షముగ కనుపడుచున్నది. ఈవేడిమినే, కర్నల్ జాక్సన్ గారు తెలిసికొనలేకున్నారు.

మెటబోలిజమ్ అనునది ఇరుతెరంగులు. ఒకటి, సింథెటిక్ (Synthetic), లేక, కన్‌స్ట్రక్టివ్ (Constructive) గనుండి, అనబోలిక్ (Anabolic) అని పిలువబడుచున్నది. రెండవది నశింపబడునది (Destructive) గను లేక, విభజింపబడునది (Analytic) గనునుండి, కటాబోలిక్ (Katabolic) అను పేరుచే, పిలువబడుచున్నది.

మనుజశరీరము ఎల్లప్పుడు నశించిపోవుచున్నది. ఊపిరితిత్తుల (Lungs) ద్వారా, కార్బన్ డైఆక్సైడ్ నున్నూ నీటి ఆవిరినిన్ని ; పక్కెరగుండెల (Kidneys) ద్వారా, నీటిని, మూత్రమును, యూరిక్ ఆసిడ్, ఉప్పులనున్నూ; చర్మముగుండా, చెమట నీటినిన్ని, కొద్దిగా కార్బన్ డైఆక్సైడ్, క్రొవ్వుపదార్థమునున్నూ; పేగులు (Bowels) గుండా, నీటినిన్ని, ద్రావకములయందు కరుగని క్షారములనున్నూ, భోజనపదార్థముల పిప్పినిన్ని (కిట్టము), అది ప్రతిదినము బహిర్గతము చేయుచున్నది. కొంచెముగా ఎపిథీలియమ్ (Epithelium) మ్యూకస్ (Mucus) యున్నూ, కొన్ని సందర్భములయందు క్షీర రసగ్రంథులు (Mammary glands), టెస్టెస్ (Testes), బయటికి విడుచు

పదార్థములున్నూ, శరీరముయొక్క పైభాగమునుండి బయలు వెడలుచున్నవి మరియు, మనుజశరీరము, ఊపిరితిత్తులద్వారా ప్రాణవాయువు (Oxygen)ను; జీర్ణకోశావయవముల (Digestivetract) ద్వారా, జలము, శాకరములు, ప్రోటీయిడ్స్ (Proteids), కార్బోహైడ్రేటియిడ్స్, క్రొవ్వులు, వృక్షాదుల సంబంధమగు నూనె, మొదలగు నాహారమును; తీసికొనుచున్నది. మనుజశరీరమందలి యీగొప్పరాకపోకలే, మెటబోలిజమ్ అనబడుచున్నవి.

ఇంకొకతూరి పైత్యరసము (Bile) ను గురించి విచారింతము. నేనిదివరకు నుడివినటుల, అది యకృత్తు (Liver) కలిగించు పదార్థమైయున్నది. యకృత్తు చేయుకార్యములను కనుగొనుటయనగా, మనుజశరీరము ఎట్లున్నదియు ఎట్లు కాలము గడుపుచున్నదియు తెలిసికొనుటయే. అది వాస్క్యులర్ (Vascular) డైజెస్టివ్ (Digestive) అవయవములతో నెటుల నాశ్చర్యముగ సంబంధపడియున్నదో ఆవిషయమును జ్ఞప్తి యుంచుకొనవలెను. అందువలన గాస్ట్రిక్ (Gastric) ఇన్టెస్టినల్ (Intestinal) జీర్ణమువలన కలుగు పెక్కుపదార్థములు రక్తమును చేరుటకు ముందు వానిని దాటిపోవలసియున్నవి. డాక్టర్ విల్లియమ్ స్టర్లింగ్ (1891) అను నతడు భాషాంతరీకరించిన డాక్టర్ యల్. లాణ్డోయస్ యొక్క మానవశరీరధర్మశాస్త్రము (Physiology) నందు ఇటుల చెప్ప

బడియున్నది. "యకృత్తు (Liver) నుగురించి మనము ఇంకను నే ర్చుకొనవలసినది యధికముగనున్నది. అదియనేకములగుపనుల ను చేయుచున్నది. కొన్ని స్పష్టముగ తెలియుచున్నవి. మరికొన్ని గూఢముగనున్నవి" యకృత్తు ముఖ్యముగ చేయుపని పిత్త రసమును వెడలనిచ్చుటయేయని యిదివరకే చెప్పియుంటిని. ఈ విషయము ఆయుర్వేదవైద్యులకు తెలిసినదేయని కర్నల్ జాక్ సన్ గారు ఒప్పుకొనక పోరు. నిశ్చయముగ నది చేయు ఇంకొక పని యేమన—యకృత్తులోని గోళములను (Cells), గ్లైకోజిన్ (Glycogen) అను పదార్థమును చేయుచున్నవి. ఆవస్తువు హెపటిక్ వెయిన్స్ (Hepatic veins) మార్గమున యకృత్తు నుండి బయిటికివచ్చి, డక్ట్స్ (Ducts) యందు ప్రవేశించక రూపమునందు కొంచెము మార్పుజెంది, రక్తప్రవాహమున జొచ్చుచున్నది. యకృత్తు అనేక కార్యముల నొనర్చుటయందు నిధిగానున్నది. అందు, పిత్తరసము ముఖ్యమగు కార్య మొనర్చుచున్నది. పశ్చిమదేశవైద్యశాస్త్రముయొక్క ప్రకాశ మైన జ్ఞానమునందు కర్నల్ జాక్సన్ గారు ఈవిషయమై దీర్ఘా లోచనను చేయ నిండు. ఇంతవరకు పిత్తరసమును గురించి చెప్పితిని. ఇక "వాతము" అనుపదముయొక్క అర్థమునకు మరలుదము. అదిగాలియను నర్థమిచ్చుపదవాచ్యముకాదు. మరి యునది, అజీర్ణపదార్థములవలన పుట్టు చెడువాయువులు ఆంత్ర ముల (పేగుల) యందు చేరియుండుటచేత సంభవించు కడుపు

బ్బరము కాదు. ఈవిషయము బాక్టీరియాలజీకల్ ఫెర్మెం టేషన్సు (Bacteriological fermentations) వలన కనిపెట్ట బడెనని మధురాపట్టణమున 1913-వ సం॥ డిశంబరుమాసమున జరిగిన అయిదవ అఖిలభారతాయుర్వేద వైద్యమహాసమ్మేళనమున నాయధ్యక్షతాభిభాషణమున చెప్పియుంటిని. వాతము అనునది నరములశక్తియే. మరియునది యొకచోటనుండి మరియొకచోటికి ఇంద్రియజ్ఞానమును మార్చునదియనిగాని, చలనము, లేక, చైత న్యమును కలిగియుండునదియనిగాని గ్రహించవలెను.

కర్నల్ జాక్సన్ గారు "వాయువు" లేక "గాలి" అనునది పశ్చిమవైద్యశాస్త్రమందలి సెరెబ్రోస్పైనల్ సిస్టమునకు, సింప తిటిక్ నరములకు సమానముగనున్నదని చెప్పినట్టుల, నేనుచదివి యుంటిని. అట్లయినచో వాయువు పక్వాశయము కటి, గుదము, మొదలగు (పెల్విస్ Pelvis) రెక్టమ్ (Rectum) ప్రదేశముల నున్నటులను శ్రుతులేల చెప్పుచున్నాడు? కర్నల్ జాక్సన్ గారీప్ర శ్నమును మిక్కిలి యుత్సాహముతో నడుగుచున్నను, ఇందా యన జయమును బొందకున్నాడు. ఏలయన మనుజుని శరీరమందు స్ప్లాంక్నిక్ (Splanchnic) నాడులుండు స్థానమును, సింప తిటిక్ నాడుల కుటుంబముయొక్క సేక్రల్ (Sacral), లుం బార్ (Lumbar) ప్లెక్స్యూసెస్ (Plexuses) యొక్క స్థాన మును చదివి కనుగొనుమని ఆయనను నేను ప్రశ్నించెదను. మ రియు మనుజశరీరమునకు సంబంధించిన శారీరవిభాగశాస్త్రము

(Anatomy) ను, మానవదేహధర్మశాస్త్రము (Physiology) ను, ఎక్కువశ్రద్ధతో చదువునిమిత్తము ఇప్పుడు వారిది పాత కాలపుబొమ్మని చెప్పుటకును కాలాతీతమై యున్నది.

"సుశ్రుతమున వ్రాయబడినటుల ఏదో యొక సందిగ్ధమైన ట్టియు గూఢమైనట్టియు ద్రవ్యము జీర్ణాశయమునకు(Stomach) ను,ఆంత్రములకును నడుమ నూగులాడుచున్నది" అని కర్నల్ జాక్సన్ గారు చెప్పినపుడు, వారి యభిప్రాయమేమో నాకు స్పష్టముగ తెలియకున్నది. గూఢమైనవస్తువు అనగ పిత్తరసమ నియూ, లేక సూర్యుసి వేడిమి యనియూ, వారి యభిప్రాయము. వారిదివరకు చదివిన శారీరశాస్త్రమందలిసంగతులను మరలజ్ఞప్తి యుంచుకొనవలెనని కోరుచున్నాను. మరియు జీర్ణాశయమున కును అంత్రములకును నడుమ పిత్తాశయము (Gall-bladder) అను నొకవస్తువున్నదనియు పురీషనాళము (Rectum) గుండ నెక్కించబడు ఆహారపదార్థము లెట్లు జీర్ణింపబడునవనియు వారికి దెలియజేయవలసియున్నది.

కర్నల్ జాక్సన్ గారు సూచించిన శ్లేష్మము (Phlegm)ను గురించి విచారింతము. "శరీరాంతర్భాగమునందుగల కోశముల తావులను (Intercellular Spaces) ఆక్రమించియుండి వానిని చల్లగానుంచునట్టి శోషరసము (Lymph) యొక్క భాగమే శ్లేష్మమని చెప్పబడుచున్నది" అని కర్నల్ జాక్సన్ గారు చెప్పుచున్నారు. పశ్చిమదేశ వైద్యగ్రంథములలో చెప్పబడిన

శోషరసము (Lymph)యొక్క నిశ్చయమైన స్థానమునుగూర్చి కొంతవరకు చెప్పుటయే ఇటుల చెప్పుట అయ్యున్నది. మానవ శరీరమును ఏర్పరచు అల్లికలు (Tissues), (1) ఎపెథీలియల్, (Epithelial) లేక. పైభాగమున (surface) నుండునవి (2) కలుపునవి (connective) లేక, అస్థిపంజరముతో (Skeletal) సంబంధించియుండునవి (3) నాడులతో (nervous), లేక, ఇంద్రియములతో (sensory) సంబంధించునవి (4) కండరములతోను (Muscular), లేక, సంకుచిత కండరములతోను (contractile) సంబంధించినవి. (5) రక్తము (blood), శోషరసము (lymph), లేక ఆహారముతో (nutritive) సంబంధమైనవి యనియు అలెగ్జాండర్ మెకాలిస్టర్ యొక్క శారీర శాస్త్రమున, అయిదువిధములుగ నున్నవని వ్రాయబడియున్నవి.

ఏ శారీరవిభాగశాస్త్రము (Anatomy) ను గాని మానవదేహధర్మశాస్త్రము (Physiology) ను గాని చూచినను, రక్తము గోళములు ప్లాస్మా అను రెండువిధములైన వస్తువుల చేరికగనున్నట్టు తెలియుచున్నది. అందు మొదటిభాగము (1) గోళ (Cellular) ములతో సంబంధపడిన వస్తువులు గలిగియున్నది. మరియునందే తెల్లకణములు (White Corpuscles), లేక, ల్యూకోసైట్సు (Leucocytes) ; మరియు, ఎర్రని (Red) రక్తకణములును జేరియున్నవి. రెండవదియగు ప్లాస్మా (Plasma) (2) అంటుకొనునదిగను, స్పష్టముగ కనబడునదిగను,

రంగును కలిగియుండనిదిగను, వెలుతురును నోరనియ్యనిదిగను (Opaque), క్షారరసమునంటి (అల్కలైన్) ద్రవపదార్థముగను నున్నది. శోషరసముకూడ (Lymph), క్షారద్రవము (అల్కలైన్)గను, రంగులేనిదిగను, శ్వేతధాతువుగ (Albuminous)ను నున్న స్పష్టమగు ద్రవపదార్థముగ నున్నయది. అందు, రంగులేని కణముల (Blood corpuscles) తో తుల్యముగనున్న శోషరస కణములుకలవు. అట్టి ద్రవపదార్థమే శోషరసముయొక్క ప్లాస్మా యని పిలువబడుచున్నది. మరియునా శోషరసము (Lymph) తక్కువ సంఖ్యగల శ్వేతధాతు (Albuminous) పదార్థములను కలిగియుండుటలో రక్తముయొక్క ప్లాస్మావలెకాక వేరు విధముగనున్నది. అన్నరసమను "రసధాతువు" (Chyle) శోష రసము (Lymph) గానున్నది. అందు విశేషముగు క్రొవ్వుసంబంధమగు చిన్నయణువు (Fatty granules) లున్నవి. ప్రతి అణువుచుట్టును శ్వేతధాతుయొక్క యావరణముకలిగియున్నది. క్రొవ్వుగల పదార్థములు జీర్ణమగునపుడు, అన్నరసము, అంత్రనాళములయొక్క క్షీరవాహికల (Lacteals) యందు నిలచి యుండును. కర్నల్ జాక్సన్ గారు నుడివిన యీక్రిందివిషయము యొక్క యర్థమేమో నాకు తెలియకున్నది. "సుశ్రుతమునందు, శ్లేష్మము (Phlegm) ఆమాశయముయొక్క లోనిభాగమున మరుగుపరచబడియున్నట్టులు వ్రాయబడియున్నది. చరకమునందు, శ్వాసాశయములు(థోరాక్స్) తల, గొంతు, కీళ్లు, మున్నగు మరి

యెచ్చోట జీర్ణముకాని భోజనపదార్థములుండునో అచ్చటను శ్లేష్మముండునని చెప్పియున్నది” ఆమాశయము, ఉరోభాగము (థొరాక్స్) తల, గొంతు, మరియు మనుజశరీరముయొక్క ఏభాగమునందైనను శోషరసగ్రంథులున్నవని కర్నల్ జాక్సన్‌గారికి తెలియదా? సైనొవియల్ మెంబ్రేను (Synovial membrane) వలన స్వీకరింపబడిన (Secreted) జిగటగనుండు సైనొవియల్ ద్రవపదార్థము (Synovial fluid) చే, సైనొవియల్ జాయంట్లు విశేషముగను సులభముగను జారునట్లు చేయబడుచున్నవి. ఆ ద్రవపదార్థమునకు సైనోవియా (Synovia) యనిపేరు. * అది రంగులేనిదిగను, క్షారమువంటిదిగను ఉండి, చెమటరూపకముగ బయిటికి వెడలుదానివలె నున్నది. మరియునిందు మ్యూసిన్ (Mucin), అల్బ్యూమిన్ (Albumin), క్రొవ్వు, ఎక్కువగ చేరియున్నవి.

కర్నల్ జాక్సన్ గారు ఆయుర్వేదశస్త్రచికిత్సనుగురించి అయిదు చిన్నవాక్యములలోనే వ్రాసియున్నారు. ఆయుర్వేదమునందు శస్త్రచికిత్సావిధానము (ప్రాక్టికల్ సర్జరి Practical surgery) శారీరశాస్త్రము (Anatomy) ను, లేవనునూహ తప్ప మరి యెక్కువసంగతి వారికి తెలియకయున్నయది. కొంచెముకాలము క్రిందటనే (1913) ప్రచురింపబడిన,

* “సంధిసంశ్లేషాత్ శ్లేష్మకస్సంధిషు స్థితః” కీళ్లయందుగల శ్లేష్మము “శ్లేషకకఫమని” పేరు వాగ్భట సూత్ర. అ. 12.

కవిరాజ గణానాథ సేనుగారిచే సంస్కృతమున విరచితమగు "ప్రత్యక్ష శారీరము" అను పేరుచేబరగు మొదటి సంపుటము కర్నల్ జాకొసన్ గారు చూచినట్లు కనుపడుట లేదు. ఆ గ్రంథముయొక్క పీఠికయందు గణనాథసేనుగారు "పూర్వ కాలమునందు హిందూదేశమున వైద్యమును శస్త్రచికిత్సను నేర్చుకొనునపుడు, శారీరవిభాగశాస్త్రమును (Anatomy) మొట్టమొదట నేర్చుకొనెడి భాగముగ నుండెను" అని వ్రాసియున్నారు. అందుకు సందేహమే లేదు. లేపరాటమి (పొత్తికడుపును చీల్చుట), కాలుచేతులను నరకుట (Amputation of limbs), ఎమ్బ్రియోటమీ (Embryotomy), పరిస్రావ్యుదర బద్ధగుదోదరములయందు యాంత్రముల (Intestines) శస్త్రచికిత్స నొనర్చుట, లిథోటమి (Lithotomy), ఇంక నితరములగు గొప్పశస్త్రచికిత్సలును, సామాన్యములగు శస్త్రచికిత్సలను ఎక్కువవిరళముగ పురాతన వైద్యగ్రంథములగు సుశ్రుతమునందును, వాహటమునందును, వర్ణింపబడియున్నవనిగూడ వారు వ్రాసియున్నారు. అప్పటి కాలమునందు వ్రాయబడిన యీవిషయములు సామాన్య జ్ఞానమునుమాత్రమే తెలియజేయుట లేదు. రక్తము స్రవించుచున్నదను విషయము చరకమునందును, వాగ్భటమునందును, స్పష్టముగ సూచింపబడియున్నది. ప్లీహము (Spleen) నుండి వచ్చెడి రంగుతోగూడిన ద్రవ మగువస్తువు సుశ్రుతమున ప్రత్యేకముగ నుదాహరింప

బడెను. రమారమి 1000 A. D. అప్పుడు వ్రాయబడియుండిన "శారీరపద్మిని" యను పేరుచే నొప్పారు శారీరవిభాగశాస్త్రము (Anatomy) అను గ్రంథము, డాక్టర్ పి. కార్డియర్ అను వారిచే ప్రచురింపబడెను. దానిని "మెడిసన్ ఆఫ్ ఏన్షంట్ ఇండియా" యను తన గొప్పపుస్తకమున డాక్టర్ హారనల్ గారు, ఎక్కువగ నుదాహరించియున్నారు. శారీరశాస్త్రము, శారీరవైద్యక, అను శారీరశాస్త్రమును దెలుపు గ్రంథములను, ఆఫ్రేఛిట్ (Aufrecht's) గారి క్యాటలాగునందు ప్రచురింపబడియున్నవి గ్రిఫ్ఫిత్ గారి బహుమానమునుగ్రహించి డాక్టర్ గిరీంద్రనాథ్ గారి శారీరశాస్త్రము (2 రెండు సంపుటములు) పైవిషయములను విపులముగ తెలుపుటలో నాదిగ్రంథముగ మిగుల ప్రసిద్ధిగాంచి యున్నది.

డాక్టర్ జాక్సన్ గారు, ఆయుర్వేదీయ "అగదతంత్రము" (Toxicology) ను గురించియు, "వ్యవహారాయుర్వేదము" (మెడికల్ జూరిస్ ప్రూడెన్సు) ను గురించియు, ఇప్పటి కాల మందలి జ్ఞానము వారికి లేకుండుటచేత గాబోలు చాలతక్కువ యభిప్రాయమును కలిగియున్నారు. "క్రీ పూ. 4-గవ శతాబ్దమున హిందూదేశమున రాజ్యమేలిన చంద్రగుప్తుని మంత్రి పుంగవుడగు చాణక్యునిచే వ్రాయబడిన "కౌటిల్యుని అర్థశాస్త్ర"మను పేరుచేబరగు గ్రంథము ఈనడుమనే కనిపెట్టబడి, 1913-వ సం॥రమున ప్రచురింపబడెను. అందు అనుమానకర

మగు స్మృతియందు, శరీరమును ఛేదించుటకు తెలియదగు సంశ
ములును, వ్యవహారాయుర్వేదము (మెడికల్ జూరిస్ ప్రూడె
న్సు) యొక్క యంశములును ఆగ్రంథమునందుగూడ కనబడు
చున్నవి" అని గణనాథసేనుగారు వ్రాయుచున్నారు. ఆయు
ర్వేదీయగుణపాఠము (ఫార్మకోపియా) నుగురించి చెప్పుటలో
నాయుర్వేదవైద్యులు మూలికాదులకొరకు చాలదూరపు అడ
వులను వెదకవలసి యున్నదనియు, వానిసంఖ్య యెక్కువగ
నున్నదనియు, కర్నల్ జాక్సన్‌గారు అభిప్రాయపడియున్నారు.
బర్రోజ్ అండ్ వెల్కమ్, పార్క్ డేవిస్ అండు కంపెనీలను
గురించి వీరేమి చెప్పుదురో తెలియదాయె. "ఆయుర్వేదీయ
గుణపాఠముల (ఫార్మకోపియా) యందు క్రొవ్వు, ఎముకలు,
మజ్జ (మూలగ), రక్తము, మాంసము, మూత్రము, చర్మము,
కండరములు, కొమ్ములు, హూఫ్స్, వెండ్రుకలు, బ్రిస్టల్స్ -
వీనినిగురించి వ్రాయబడియున్నది" అని కర్నల్ జాక్సన్‌గారు
హేళనముగ చెప్పుచున్నారు. బ్రిటిష్ ఫార్మకోపియా యందు
పైనుదహరింపబడినవి యుండుటయేగాక, కస్టోర్కమ్, ఫాన్
క్రియాస్, థైరాడ్ గ్లాండ్స్, టెస్టిస్ అనునవిగూడ నుదా
హరింపబడియున్నవి. గాన ఫార్మసీని గురించి యెక్కువగ చెప్ప
వలసినది లేదు. మరియు వీరిగుణపాఠములలోని కొన్ని మరబతు
లయందును, ఇంగ్లీషుమందులగు క్వయినా (చింకోనా,) ఏలకు
లద్రుతు (కార్డమమ్ కాంపొజిషన్,) లయందును కొఖినియల్

అనునది ఒక భాగముగనున్నది. అయ్యది కుక్కదగ్గు (హూపింగ్ కాఫ్) నందు వాడబడుచుండెను. వైరల్, పానో పెప్టోన్, లెయిబిగ్ ఎక్స్ట్రాక్ట్ ఆఫ్ మీట్, వాలెంటైన్ అనునవియు, లేగదూడల కాళ్లనుండి సిద్ధము జేయునట్టివస్తువు, (కాఫ్స్ ఫూట్ జెల్లి.) మూలికలకు జేరినది కాదని దెలియదా?

కర్నల్ జాక్సన్ గారు, ఆయుర్వేదీయ స్వస్థవృత్తములు (హైజీన్) ను ఆరోగ్యవిధానములును (శానిటేషన్,) తప్పుగా నున్నవని చెప్పుచున్నారు. అయ్యవి క్రొత్త శాస్త్రములనియు, ఇంకను అభివృద్ధిని చెందుచున్నవనియు మనము జ్ఞప్తియం దుంచుకొని వెనుకటి కాలమందలి తప్పిదములను పోగొట్టు కొనుచు కాలమును గడుపుచున్నాము. ఇప్పటివారలు ఒక దిన మున ఒకవిషయము సరిగనున్నదనియును ఆవిషయమును మఱుదినముననే, చెడ్డదనియు నిరూపించుచున్నారు. ఇంగ్లం డులో సహితము బీదజనుల గృహములను చక్కబరచునట్టి ముఖ్య విషయములు కొద్దికాలము క్రిందటనే బయలువెడ లెను. ఫ్లారెన్సు నైటింగేల్ అను సత్పురుషురాలు ప్రసిద్ధముగ నందరికి దెలియుటకుపూర్వము, క్రిమియన్ యుద్ధమున పెక్కు సంఖ్యగల శిపాయిలు మృతినొందిరి. ఆమె యుద్ధభూమికిగాని, రక్తముచే నావరింపబడిన వధగల ప్రదేశమునకుగాని రాక, స్కుటారి (Scutari) యందున్న పరిశుద్ధమైన శిపాయీల ఆసుపత్రికి వచ్చియుండెను. ఆ సుగుణవంతురాలగు స్త్రీరత్నము, దినము

నకు 22 గంటలకాలము ఆసుపత్రియందు పనిచేయుచు, దెబ్బలు తగిలి బాధపడువా రుండుతావున తిరుగుచు నుపచరించుచుండెను. చేతదీపమునుబూని, పరలోకమునుండి యేతెంచిన దేవతవలె కనబడుచు, ఆసుపత్రియందు మైళ్లకొలది తిరుగులాడుచు జనులప్రాణములను కాపాడుచుండెను. ఇట్టి సుగుణరాశియగు నామెకు, సర్వజయము కలుగుగాకయని ప్రార్థించెదను. ఆమె యట్లొనర్చనియెడల, అనారోగ్యముచే నందరును మృతినొంది యేయుందురుగదా? ఇట్టిపశ్చిమదేశపు ఆరోగ్యపద్ధతి (Sanitation) ని గురించి కర్నల్ జాక్సన్‌గారు అధికముగు క్రౌర్యాధికతతోడను పక్షపాతముతోడను చెప్పుటచూడ వినోదముగ నున్నయది.

బ్రిటిష్ ఫార్మకోపియా యందు (1898) ఎట్టి రంగును కలిగియుండనట్టియు, ఆవిరిరూపకముగ పోవునట్టియు, వమనమును కలిగించెడి దుర్వాసనగలదియునగు " పిరిడిమ్ " అను ద్రవపదార్థమును మనము చూచుచున్నాము. దానిని కార్డియాక్ డిస్ ప్నోఇయా (Cardiac dyspnoea), అను వ్యాధియందును లేక, ఉబ్బసము (Asthma) నందును పీల్చినయెడల నెమ్మదికలుగుచున్నది. అది, ఎముకలను పొడిచేసిన పిదప యేర్పడు పదార్థములనుండి బట్టీద్వారా తీయబడిన ప్రధానవస్తువుగ నున్నది. అయినను ఏజంతువుల యెముకలయినది తెలియలేదు. పెప్సిన్ (Pepsin) అనునది, పందులు,

గొట్టెలు, ఆవుదూడలు, మున్నగువాని జీర్ణాశయము (Stomach) యొక్క మాంసపు పొరలనుండి తీయబడిన ఎంజైమ్ అను పదార్థము (Enzyme) గనున్నది పసివాండ్రయొక్కయు, బలహీనులయొక్కయు, వ్యాధులయందు ఎక్కువ ప్రయోజనకరముగ పనిచేయు మధురవిపాకరసము (Pancreatic juice), ప్రత్యేకమగు నాలుగు గుణములను కలిగియున్నది. అందు (1) స్టార్చిని (Starch) మార్చుచున్నది (2) ప్రొటియిడ్స్ (Proteids) ను మార్చుచున్నది. (3) క్రొవ్వును మృదువుగా చేయును. (4) పాలను గట్టిపరచుచున్నది. మరియు ఇక్థైల్ (Icthyol) అనునది చర్మవ్యాధులయందు పైనను, లోనను, నుపయోగించుటచేతను బాగుగ గుణపరచుచున్నది. ఇయ్యది ముఖ్యముగ చేపలుమున్నగువాని యవయవములు కొంతకాలము భూమియందుండుటచే జీర్ణమయి శిలారూపమునుదాల్చుచున్నవి. భూమినుండి త్రవ్వియెత్తబడిన అట్టిఒకవిధమగు ఖనిజసంబంధమైన వస్తువునుండి బట్టీద్వారా తీయుబడిన నూనెతో సల్ఫూరిక్ ఆసిడ్ (Sulphuric acid) ను కలపవలెను, అనంతరము నవసారమును (Ammonia) న్యూట్రిజర్ అనువస్తువును (Neutralization) చేర్చవలెను. యిట్టిసంయోజనమునుండియే ఇక్థైల్ అనునది యేర్పడుచున్నది. మరియు యిక్థియోకొల్లా (Icthyo colla), లేక, చేపల గ్లూ (Fish-glue) వంటి పదార్థముగనున్న ఐసింగ్లాస్ (Isinglass) అనునది లండర్

ఫార్మకోపియాలయందు చాలాకాలము క్రిందటనే ప్రసిద్ధిగాం చెను. అది, వైద్యమునందు, ఆహారపదార్థముగ నుపయో గింపబడుచుండెను. ఐరోపాఖండముయొక్క యితర దేశములందు గుణపాఠము (ఫార్మకోపియా) లలో నిప్పటికి నది యుపయో గింపబడుచున్నది. అవి పలువిధములగు చేపల మూత్రపుతిత్తుల (Bladders) నుండి తీయబడిన చిన్నముక్కలై యున్నవి. బొం బైలో గోల్ (Ghole) అను చేపల మూత్రపుతిత్తులు చైనాదేశ మునకు ఎక్కువగా నెగుమతి యగుచున్నవి. రష్యాదేశపు ఐసిం గ్లాస్ అనునది అత్యుత్తమమైనదిగా నెంచబడుచున్నది. చర్మము, లిగమెంట్లు, ఎముకలు మొదలగువాని మీద వేడినీటిని పోసి పిదప దానిని గాలిచేత నెండునట్లు జేయువలెను. ఎండినవెనుక నేర్పడినవస్తువయే "గల్లెటిను" అయ్యున్నది. ప్రాతవియు,చినిగి నవియునగు పాదరక్షలును, గుఱ్ఱపుజీనుసామానులును, చర్మ ముతో చేయబడిన పనికిరాని యితరవస్తువులునుకూడ ఇంగ్లం డున జెల్లి అనుద్రావి (Jelly) గ చేయబడుచున్నవి. ఐర్లండు నందును, ఫ్రాన్సునందును, వానిచేత జెల్లికి సంబంధమగు వస్తు వులు చేయబడుచున్నవి. గొఱ్ఱెలయొక్క థైమస్‌గ్లాండ్, థైరాడ్‌గ్లాండ్ సుప్రరీనల్ (Suprarenal) గ్లాండు అనునివి దివ్యమైన ఔషధభాగములుగా చేయబడుచున్నవి. ఇప్పటి వైద్యులు కాడ్ లీవర్ ఆయిల్‌ను ఎక్కువ యుపయోగముగ వాడుచున్నారు. ఆస్ట్రేలియాయందు ఇరువది సంవత్సరముల

క్రిందట గండమాలవ్యాధి(స్కాృఫ్యులా, ట్యూబర్ కల్)యందు ఎక్కువ గుణమును కలుగజేసిన డూగాంగ్ ఆయిల్ (Dugong Oil) క్రొవ్వుయొక్క పైభాగమును ఉడకబెట్టుటచేత నేర్పడు చున్నది. ఆవస్తువు కాడ్ లీవర్ ఆయిల్ వలె అసహ్యమును కలుగ జేయదు. మనదేశమున గవర్నమెంటు మెడికల్ స్టోర్ కీపరుగా నున్న డాక్టర్ డైమోక్ అనువారు గవర్నమెంటు డిస్పెన్సరీ లకును, ఆసుపత్రులకును, బొంబై తీరమున కనుపడు పెద్దచేపల కార్జము(యకృత్తు) Liver లనుండి తీయబడిన నూనెను అనేక సంవత్సరములవరకు పంపుచుండిరి. సేటాసియమ్ (Cetaceum) అనునది, స్పెర్మ్‌హేల్ (Sperm whale) అను తిమింగలము యొక్క తలనుండి తీయబడిన నూనెతో కలిసిన క్రొవ్వుపదా ర్థమైయున్నది. ఆ తిమింగిలము పసిఫిక్, ఇండియన్, సముద్ర ములయందు నివసించుచున్నది. అదిమట్టుకు చాలాదూరము ప్రయాణము చేయుటలేదాయని కర్నల్ జాక్‌సన్ గారిని అడుగవలసియున్నది. నేను చెప్పదలచియున్న దానినంతయును ఇచట చెప్పియుండలేదు. బాధనొందువాడు "నా బాధను నివారణచేయుటకై దేనినైన నిండు; లేక నా బాధను పోగొట్టు టకై చిన్నపురుగునైన నిండు." అనుచున్నాడను "స్థాలీపులా కన్యాయము"గ చూపుటకుమాత్రము, అవశ్యకమగు విషయ మును, ఇదివరకే చెప్పితిని. ఇట్టి మనుజుల కోరికలను, మనము వినుచుండుటలేదా? వీనికి ఏ ఔషధమునైనను, ఏమాత్రనైనను,

స్త్రీగాఁడి మందున్నాననుచు, కనిపెట్టవలదా? మనము నిర్దయులమై యొకచోట గూరుచుండి మృతినొందఁబోవువానివంకఁదిరిగి "కావలసినన్ని మందులున్నవి" అని చెప్పవలెనా? అటుల చెప్పుమని పశ్చిమదేశ వైద్యజ్ఞానము మనకు బోధించుటలేదు. మరియు నటులనే యాయుర్వేదవైద్యశాస్త్రములుగూడ చెప్పుటలేదు.

"ముందు జరుగఁబోవు విషయములు ఈవిధమున నుండవచ్చునని తెలుపుట, గోచరమగువాటిని అధికారమునకు లోబడునటుల జేయుట, వ్యాధులను రాకుండ కాపాడుట, మరియు నట్టి వ్యాధులను నివారణచేయుట—మున్నగునవి పలువిధ శాస్త్రాభివృద్ధితో తుల్యమగు నిప్పటి వైద్యశాస్త్రముయొక్క యుద్దేశములై యున్నవి" యని వాషింగ్టన్‌లోనున్న డాక్టర్ ఫీల్డింగ్ గారిజన్‌గారు, తమ గ్రంథము చివర, బలవత్తరముగ వ్రాసి యున్నారు. "మనుజసామర్థ్యమును, మనుజుడు పొరబాటు పడతగినస్థితిని శాస్త్రము సరిగ ననుకరించునుగాన, మనము తలంపులయందే శాస్త్రమునకు పట్టాభిషేక మొనర్చి, వినయమున దానికి కిరీట మొసంగితిమి" అని మైనోట్ (Minot) అనువారు వ్రాసిన యీ చక్కని వాక్యములోనున్న యభిప్రాయముకంటె వేరు అభిప్రాయమును వ్యాధులను రాకుండ జేయు వైద్యశాస్త్రము చెప్పుటలేదు.

మనము దేనిని చేసినను అట్టి ప్రతికార్యమును పరమదయాళుడైన భగవంతుడు చేయించుచున్నాడని మనము గ్రంథీ

రమైన వినయముతో జ్ఞాపకముంచుకొనవలెను. అట్టివానిసహాయము లేనిది మనము దేనియందును జయమును పొందలేము. మనము కష్టించి పనిచేయవచ్చునుగాని, ఫలితము నొసంగువాడు భగవంతుడై యున్నాడు. బాధాపీడితులగు జనులందరును, పసికూన మొదలు తెల్లని తలవెంట్రుకలను గలిగిన పండుముదుసలి వరకును, అతిక్రూరాత్ముడు మొదలు పరమతపస్వియగు సాధువు వరకును, నిశ్చలంబును పరిశుద్ధంబునైన మన కరుణకును, ఎడతెగని పట్టుదలగల పోషణకును తగినవారుగ నున్నారు. గొప్పవారికిని సామాన్యులకును, భాగ్యవంతులకును బీదవారికిని భేదమున్నటుల కాయచికిత్సకుడుగాని శస్త్రచికిత్సకుడుగాని తలచరాదనియును; పల్లెటూరి మూఢుడును ఎక్కువచదువరియును జ్ఞానము గలవాడును సమానులేయని వైద్యుడు తలచవలెననియు; ఒకరియెడ నెట్టినిపుణత శ్రద్ధ వహింపనగునో, అట్టి నిపుణతను శ్రద్ధను యింకొకరియెడగూడ జూపనగునని వైద్యుడు తలచవలెననియు; అట్టిదానిని చూపులాగున మనకు సాధ్యమైనంత నిపుణతను, శ్రద్ధను ఇతరులయెడ చూపుటకు మనము అర్హులమై యున్నాము. రోగము బాధయు నెచట కనుపడినను దానిని తగ్గించి తుదకు మనుజుల విచారమును పోగొట్టి అతుల మహోపకారము నొనర్చు వృత్తికంటెను కొలువుకంటెను హెచ్చయినది మరెద్దియును లేదు.

నాయభిభాషణమును ముగించుటకు ముందుగ నింకొక మాట చెప్పవలసియున్నది. మన హిందూవిశ్వవిద్యాలయము నభివృద్ధిలోనికి తేదలచినవారును, నిర్వహించువారును అందరునుకూడి యిప్పటికాలమున చేయబూను ప్రతికార్యమునకు నావశ్యకమగు సమత్వబుద్ధిని, అందరిని సమ్మతింపజేయగల గొప్పబుద్ధితోచేరిన దాతృత్వమును, కలిగియుండవలెనని ప్రార్థించుచున్నాను. సంఘీభావము బలముగనుక హిందూదేశీయులందరును సోదరభావమున కలసిమెలసి యుండవలెను

మనహిందూదేశమున రాబోవుకాలమునకు మీరొక యాశగనున్నారని వారణాసీ విద్యార్థులగు మీకు బోధించుచున్నాను. ముందు పుట్టబోవువారికి మీరొక దీపముగనుండి వారి నుద్ధరింపవలసియున్నది. ఇక పుట్టనున్న వారికొరకై మీయందుంచిన నమ్మకమునకును, ఆజ్ఞలకును, మీరు తగినవారుగ నుండుడు. అది పవిత్రమైన నమ్మకము. ఈబ్రిటిషు ప్రభుత్వమునలననే మీయందుంచబడిన నమ్మకముయొక్క ఫలితములను గాంచి, మీదేశమునకును ప్రకాశమానమైన మీవంశమునకును, తగినవారుగనుండుడు. పరమదయాళువైన మన పరిపాలనమువారిచే నొసగబడిన యీనూతన హిందూ విశ్వవిద్యాలయము (యూనివర్సిటీ) విషయమున మీరు చేయు కార్యములను దేవుడు సఫలముగ జేయుగాక.

---

శ్రీమద్ధన్వన్తరయేనమః.

# ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలయందు

మాచే సంప్రదాయానుసారముగ వ్రాయబడి ముద్రితములై

క్రయమునకు సిద్ధముగనున్న

# ఆయుర్వేద వైద్యగ్రంథములు.

☞ * శాశ్వత చందాదారులకు మా మాధవనిదానముతప్ప మిగత పుస్తకములు 100-కి 25-ర్పూ. తగ్గించి ఇవ్వబడును.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | మాధవనిదానము - సంస్కృతము. విపులాంధ్ర వ్యాఖ్యాయుతము. రోగనిదానాదులం దెలుపు గొప్ప వైద్యగ్రంథము. వెల ... ... | 8 | 0 | 0 |
| 2. | పథ్యాపథ్యము - సంస్కృతము. విశదమగు తెనుగు తాత్పర్యము వ్రాయబడినది. ప్రతిరోగమునకును హితాహితములగు పథ్యాపథ్యములను దెలుపును. వెల ... | 1 | 0 | 0 |
| 3. | ఆయుర్వేదపరిభాష-అనేకగొప్ప ఆయుర్వేదగ్రంథములనుండి సంగ్రహింపబడినది. సంస్కృతమునకు చక్కని తెనుగుటీక. ఆయుర్వేదౌషధముల జేయువారు ముఖ్యముగ నెరుగవలసిన విషయము లనేకము లిందుగలవు. వెల ... ... ... | 1 | 8 | 0 |
| 4. | అగస్త్యవైద్యము-దక్షిణదేశపు వైద్యసంప్రదాయములను బోధించు తెనుగువచనము. వెల ... | 0 | 4 | 0 |

* ఇంతవరకు ముద్రితములును నికమీద ముద్రింపంబోవు గ్రంథముల నన్నిటిని గ్రహించువారు శాశ్వతచందాదారులుగ నెన్నబడుదురు.

5. ఆయుర్వేదాంగశల్యతంత్రము - ఆయుర్వేదమున శస్త్రచికిత్స లెట్లు కనుగొనబడినదియు దానినభ్యసించు మార్గములను బోధించు తెలుగు వచనము. వెల ... 0 4 0

6. వస్తికర్మము - "పిచికారి" యొక్క స్వరూపమును దాని నుపయోగించు విధమును అందుపయోగింపబడు చికిత్సామార్గములును వ్రాయబడియుండు తెలుగు వచనము. వెల ... ... ... 0 4 0

7. అర్కప్రకాశము - ప్రతిమూలికనుండియు "అరకుల" దీయుట కుపాయములను వానిచే రోగములను కుదుర్చు మార్గములను ఆయుర్వేదపద్ధతి ననుసరించి తెలుపు గొప్పచికిత్సా గ్రంథము. సంస్కృతమునకు విస్తృతమైన యాంధ్ర వ్యాఖ్యానము వ్రాయబడి యున్నది. వెల ... ... ... 2 0 0

8. భేషజకల్పము - వైద్యప్రక్రియలను తెలుపు సుప్రసిద్ధ ఆంధ్రపద్యకావ్యము. అతి విపులముగ సాంధ్ర వ్యాఖ్యానము కలదు. వైద్యులుమాత్రమే గాక ప్రతియాంధ్రుడును చూడదగినయుత్తమగ్రంథము, వెల... 1 0 0

9. రసప్రదీపిక - రసతంత్రప్రక్రియలను బోధించు సుప్రసిద్ధమైన తెలుగు పద్యకావ్యము. రసార్ణవాది గ్రంథముల సహాయముచే తేటతెనుగున తాత్పర్యము వ్రాయబడినది. ఇందు తెలుపబడియుండు లోహాదిధాతువులకు ఇంగ్లీషు పేర్లు చూపబడియున్నవి. వెల ... 1 8 0

10. ఆయుర్వేదచరిత్రము - ఆయుర్వేదము నందలి విషయములు మొదలగువానిని విపులముగ చర్చించు తెలుగు వచన గ్రంథము. వెల ... ... 0 4 0

11\. అధ్యక్షకాభిభాషణములు—"బొంబాయి" "కొల్లంగోడు" లలో జరిగిన ఆయుర్వేద వైద్యమహాసమ్మేళనమునయిచ్చిన ప్రధానోపన్యాసములు. ఇందు ఆయుర్వేద వైద్యక విషయములును, అందలి గ్రన్థములును ఆయాదేశములయందు వైద్యాభివృద్ధియును రాజకీయ వైద్యకశాసనమును విపులముగ విమర్శించబడినవి. ... 0 6 0

12\. ఆంధ్రదేశము - వైద్యసహాయము. వెల ... 0 1 0

13\. హిందూవిశ్వవిద్యాలయము - ఆయుర్వేద ప్రశస్తి - ఇది మహామహోపాధ్యాయ కవిరాజ గణనాథసేన్ ఎం. ఏ. ఎల్. యం. ఎస్. గారిచే ఆంగ్ల భాషయందు వ్రాయబడినది. వెల ... 0 4 0

14\. పైదానికి ఆంధ్రమున పరివర్తితము - ఇందు ఆయుర్వేదము ఆధారరహితమగు శాస్త్రము గాద (Scientific) నియు త్రిదోషతత్వవినిశ్చయము మొదలగు విషయములు చక్కగా విమర్శింపబడినవి. వెల... 0 6 0

15\. హిందూవిశ్వవిద్యాలయము-గత నూరుసంవత్సరముల కాలములోని వైద్యాభివృద్ధి. ఇది లెఫ్టనెంటుకర్నల్ కే.ఆర్.కీర్తికర్. ఎఫ్.ఎల్.యస్. ఐ.ఎం.ఎస్. (రిటైర్డు) గారిచే ఆంగ్లభాషయందు వ్రాయబడినదానికి ఆంధ్రమునపరివర్తితము. ఈగ్రంథనామముచేతనే నిందలివిషయములు సర్వజనసుబోధితము. వెల 0 6 0

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులు,
ఎ. వి. ఎస్., ఎ. ఎం. బి.
ఆయుర్వేదాశ్రమ గ్రన్థమాలా ఆఫీస్,
నెం. 55, ఆచారప్పన్ వీధి, జి.టి. మదరాస్,

టెలిగ్రాఫ్ అడ్రసు,
"పండిట్" మదరాస్.